# శ్రీ నిరంజన విజయము

అను

(నిరంజనశాస్త్రిగారి చరిత్ర)





ఉభయభాషాప్రవీణ

కొండూరు వీరరాఘవాచార్యులు

# పీఠిక

మహాపురుషుల జీవితములు కాలమను ఎడారియందలి పాదచిహ్నములై యొప్పునని (కాలమనెడు ఎడారులందున, జనుల కాల్నడజాడలున్నవి.) కవిశేఖరుడొకడు వచించి యున్నాడు. చరిత్రాధారములులేక, మార్గదర్శకములగు సదాచారములులేక జీవనపు టెడారిని యాత్రసాగించు ప్రజకు ఉత్తమపురుషజీవితగాథలు అమూల్యములగు దిక్సూచీయంత్రములై యొప్పును. వేదములు ఉపనిషత్తులు పఠించి సారము గ్రహింపజాలని ప్రజాసామాన్యముకొఱకై పూర్వులు పురాణగాథలను రచించియున్నారు. అయ్యవి మహాపురుష జీవితకథలు గాక మఱేమి? ఏయే జీవితఘట్టములందు ఏయేపురుషవరులు ఎట్లెట్లు జిజ్ఞాసను సాగించిరో, ఎట్లెట్లు వర్తించిరో, ఏయే బోధలసలిపిరో మనకుఁదెలుపుటకే ఈగ్రంథములు వ్రాయబడుట. వానియందుగల వివిధభావములతోడను పూర్తిగ మనము ఏకీభవింపజాలినను లేకున్నను, మన జీవయాత్రయందు ఋజుమార్గమునుజూపు దివ్యజ్యోతులనుగా వానిని ఉపయోగించుకొనవలయును.

శ్రీనిరంజనార్యునితో చిరతర పరిచయముగలిగి, వారు తలపెట్టి నడపిన సంస్కరణోద్యమమున చాలకాలము అనుచరుడనై వర్తించినాడనను కారణమున, ఏతద్గ్రంథకర్త నన్నీపీఠికను వ్రాయ నర్థించియున్నాడు. శ్రీశాస్త్రివర్యుని సుబోధామృతమును గ్రోలిననేను కృతజ్ఞతను వెల్లడించుటకై ఇదొకయదను దొరకెనని సంతసించువాడ.

విశ్వకర్మవంశజులు అయోదారుతామ్రశిలాస్వర్ణ కృత్యముల నన్నింటిని దేశకాలపరిస్థితుల కనుగుణ్యముగ నిర్వర్తింపవలసినవారయ్యును, బహుళజనసామాన్యమున కుప కరించుకర్మలను విడిచి, అల్పసంఖ్యాకులగు ధనాఢ్యుల కుప కరింపగల స్వర్ణవృత్తిని విశేషముగా నవలంబించుట యుగవిప రీతకార్యము. ప్రజాసౌభాగ్యమునుగూర్చి యానందించుచు వారిమన్ననలచే తృప్తులై, గౌరవజీవనము గడపవలసినవారయ్యును ధనాకర్షణాభిలాషులై సమగ్ర ధర్మనిర్వహణమునకు మాఱుగా స్వార్థసాధనమునకు ప్రాధాన్యమునొసగిరి. యాంత్రికయుగమగు నిక్కాలమున వీరికి సఫలత చేకూరజాలదయ్యె. సంఘనిర్మా ణము సర్వాంగసుందరమై వెలసినతఱిని శిఖరమునలంకరించి మెఱుగిడుటవంటిది స్వర్ణవృత్తి. అట్టియెడ సంఘభవనము కాలవశమున చౌడుపట్టి శిథిలీభూతమగుచుండ, దానిని పున రుద్ధరించుకర్తవ్యమును అన్యజాతులవారికి విడిచివేసిరి. మీదు మిక్కిలి ఆయావృత్తులు లాభదాయకములు కావనియు, గౌరవ ప్రదములు కావనియు సైతము భ్రమపడిరి. వీరు విడనాడిన కర్మలను ఇతరులవలంబించి వర్ధిలుటలేదా ? విదేశవస్తువుల పోటీకితాళి, తాము పొందగలంతమట్టుకేని గౌరవము పడయుట లేదా ? కాలానుగుణ్యముగ వర్తింపక వీలగునా ? ఈనాడు సయితము శాస్త్రపరిచయముంగూర్చు సారస్వతవిద్యను కార్మిక వృత్తులతో మేళవించి వర్తించుచో మాన్యతకు కొదువలేదు.

ఈధర్మరహస్యమునెఱింగిన శ్రీ నిరంజన సుధీంద్రుడు విశ్వబ్రాహ్మణసంఘమును నుద్ధరింపఁబూని, సహస్రముఖముల

కర్తవ్యకార్యము నుగ్గడించి ప్రబోధము గావించియున్నాడు. ఇందుకు వారి ప్రబోధినీపత్రికా ప్రచారము, సంఘసభల నిర్మాణము, గ్రామసమాజ సంస్థాపనము, ప్రవాసికోపన్యాసములు కావలసినన్ని నిదర్శనములు కావా? బాల్యమాది సరస్వతీ ఉపాసనాపరులయ్యును, కష్టతరలోహకర్మనవలంబించి ఎనలేని కీర్తిప్రతిష్ఠలగడించిన వారిజీవనసరణి వారి సిద్ధాంతములకు తార్కాణ కాదా? శ్రీ శాస్త్రిగారి నిరాడంబరజీవనము, ఉదార చరితలు, పరోపకారధురీణత విశ్వబ్రాహ్మణులకేగాక ఎల్లరకును ఆదర్శప్రాయమై ఒప్పునన్న అతిశయోక్తి కాదు. శ్రీ శాస్త్రిగారి సంస్మరణమువలన ప్రజలనిప్పటికైనను మేల్కొలుపునుద్దేశ్యముతో ఈజీవితకథను రచించుట మేలే. విశ్వబ్రాహ్మణులు ముఖ్యముగా తమ హృదయములందడవిచూచుకొనినచో, తనయుపదేశముల నొకప్పుడు పెడచెవిని బెట్టినను విసుగుజెందక, ఉదాసీనత వహింపక, సదా తన సందేశముల నచట స్మరింపుచుండు శ్రీ శాస్త్రిగారి దివ్యవాణిని గుర్తింపగల్గుదురు. అటులగావించి ధన్యులయ్యెదరుగాక.

కలియుగమున సంఘశక్తియే సర్వసమర్థమైనది. దానిని మించిన బలము దేనికిని లేదు. రాజాధిరాజులును దానికి జోహారనకతీరదు. భారతదేశ పరిపాలనమునడపు పారిశ్రామిక మంత్రులును సుస్పష్టముగ వాకొనుచున్నారు. ఏప్రజలైనను సరియే, తమలో తాము సఖ్యతగూర్చుకొని, సంఘముల నెలకొల్పుకొని, సమష్టిని తమకోరికలను దెలుపుకొనుచో

ప్రభుత్వమువారు కాదనసాహసింపరని బహిరంగముగా చెప్పు చున్నారు. కావున విశ్వబ్రాహ్మణులు తమనావహించి యున్న అనైకమత్యపిశాచమును దిశాంతములకనిపి, సంఘీభావము పరస్పరానురాగము కూర్చుకొని, తమ పలుకుబడిని పునరుద్ధరించుకొని, సహనము, సత్యము, శాంతము, అహింస మొదలగు సద్గుణముల నలవరచుకొని, కృతార్థులగుదురుగాక!

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీ మైత్రేయ్యాశ్రమము
గూడవల్లి.
18—12—28

త త్వా నం ద.

# మనవి

ప్రాతస్స్మరణీయులగు మహనీయుల చరిత్రములు మన జీవితములను సంస్కరించి, పరమపురుషార్థమును బ్రాపింపఁ జేయఁగలవనుట సత్యము. దేశకాలపాత్రముల కనుగుణ్యముగఁ గర్తవ్యాకర్తవ్యములను బ్రబోధించి, మానవునిలో గుప్తముగా నున్న అఖండశక్తులను విజృంభింపఁజేయుటకును, కార్యరంగమున విజయమునందఁగల యుత్సాహము నినుమడింపఁ జేయుటకును, ఉత్తమపురుషచరిత్రములు సాధనములు. సామాన్యముగాఁ జరిత్రయే జీవితమునకు వికాసమును గూర్చునన్న, గొప్ప వారి చరిత్రలమాట చెప్పెడిదేమి ?

శ్రీ నిరంజనశాస్త్రిగారి జీవితచరిత్రను వ్రాసి, ఆంధ్ర మహాజనుల కందించవలయునను సంకల్పము నాకుఁ జాల కాలమునుండియుఁ గలదు. దానంజేసియే శాస్త్రివర్యునితో సంభాషించునపుడును, వివిధవిషయములందు వారితోఁ గలసి మెలసి తిరుగునపుడును వారి స్థిరతరాభిప్రాయములను, ఉత్తమాదర్శములను శ్రద్ధతో సంగ్రహించుకొనుచుండెడువాఁడను. వారు జీవించియున్నప్పుడే ఈ చరిత్రనువ్రాసి నాకాన్కగా వారి కర్పించుభాగ్యము కొఱవడినను, నేటికైనను బ్రకటింపఁ గల్గినందులకు సంతసమే.

శాస్త్రిగారి జీవితములోని ముఖ్యాంశములను మూఁడు వంతులవఱకు నిందుఁ బొందుపఱచితి ననుకొందును. ఇంకను వారిదేశపర్యటన సందర్భములందలి విశేషములు, అమూల్యములగు కొన్ని ఉపన్యాసభాగములు, వారాయాతావుల నందిన సత్కారవిషయములు గ్రంథము పెరుగునను తలఁపునఁ

గూర్పఁబీలయినది కాదు. శాస్త్రిసత్తముని ఆయుపన్యాసము లను, పలుతావుల వారు సలిపిన బోధలను ఒకపుస్తకముగాఁ గూర్చిన నెంతయో ఉపయోగముగా నుండును.

నే నెఱుంగని శాస్త్రిగారి జీవితాంశములను బెక్కింటిని వారిసహచరులగు పెద్దలవలనను స్నేహితులవలనను దెలిసి కొని ఈపొత్తమును రచించితిని. ఈవిషయమున నింకను నా కెక్కుడుగా నుపకరించినవి బ్రహ్మశ్రీ పొన్నపల్లి వేంకట రత్నయ్యగారి తత్వానంద గ్రంథాలయములోని ప్రబోధినీ పత్రికా సంపుటములు. అట్టివానిని కడుశ్రద్ధతో భద్రపఱచి సంఘోపయోగము సేయు వీరభినందనీయులు. నా రచనా విధానమున నేవేనిదోసంగులున్న మన్నించి, నిరంజనకవి శేఖరుని జీవితాదర్శముల ననుసరించి, స్వీయజీవితముల సార్థ కింపఁజేసికొనఁ బాఠకలోకము నర్థించుచున్నాను.

నాప్రార్థన నాలించి విపులమగు పీఠికను వ్రాసియిచ్చిన శ్రీ శ్రీ తత్వానందస్వాములవారికి నమస్కృతులు. ప్రబోధినీ సంపుటములనిచ్చి తోడ్పడిన వేంకటరత్నయ్యగారికి, గ్రంథ ముద్రణమునకు ద్రవ్యసహాయముచేసిన బ్రహ్మశ్రీ కందేపు హనుమయ్యగారికిఁ గృతజ్ఞత. ఒక సాహితీనిర్మాతకు, పండిత ప్రకాండునకు, సంస్కర్త్రవతంసునకు, తచ్చరిత్ర రచనారూప మున నీపాటి సేవయొనర్చు నవకాశమును నాకే లభింపఁజేసిన మిత్రవర్గమునకు అభివాదములు.

బహుధాన్య, పుష్యము.
తెనాలి.
31—12—38

రచయిత.



ప్రతిభయే కాదు వ్యుత్పత్తి బలము కలిగి
సవనవిద్యయె కాదు యాజకత గలిగి
కర్మయోగము భక్తియోగమును గలిగి
స్వచ్ఛసేవాధికృతి మన్న శాస్త్రి ఇడుగొ

# అంకితము

గీ. విశ్వకర్మమహాకల్ప ◆ వృక్షమందు
పుష్పఫలభరితంబులై ◆ పొల్చి దెసల
సాఁగియున్నట్టి బ్రహ్మర్షి ◆ శాఖలందు
నలరెనొకశాఖ కృష్ణనా◆మాంచితమయి.

శా. మౌనీంద్రస్తుత సచ్చరిత్రుఁడు, జగ◆న్మాన్యుండు కృష్ణర్షి, వి
జ్ఞానోపార్జితభూరికీర్తి, జగతీ ◆ సర్వోపకారాగ్రక్రియా
ధీనుం డాఋషివంశమందుదయమం◆దెన్ భూజనుల్మెచ్చ, ల
క్ష్మీనారాయణ గణ్యమానగుణ ల◆క్ష్మీయుక్తుఁడై యొప్పుచున్.

గీ. అతఁడు కందేపుగృహనామ ◆ మందగింప
వఱలి కొల్లూరుగ్రామ ని◆వాసియగుచు,
సచ్చరిత్ర భైరాగమ్మ ◆ సాధ్వియందుఁ
గాంచె నిరువురుసుతుల వి◆ఖ్యాతియుతుల.

క. సుబ్రహ్మణ్య హనుమయలు
నాఁ బ్రబలెడువారిలోన ◆ నయకోవిదుఁడై,
సుబ్రహ్మణ్యము తాను ప
రబ్రహ్మ సమర్చనాభి ◆ రతుఁడై వెలసెన్.

గీ. సూరిగణ్యుఁడు వేంకట ◆ సుబ్బమాంబ
పతి యతండు సువర్ణశి◆ల్పంబొనర్చి
కీర్తి గడియించిమించె, నా◆కీర్తి తనని
పేరిటను శ్రీనిరంజన విజయకృతిని
అంకిత మొనర్చినాఁడ నా◆హ్లాదమెసఁగ.

క. నిరవధిక భోగభాగ్యా
కరమయి తద్వంశమధిక ◆ గౌరవలీలన్
బరమేశ్వరకృప సంప
ద్భరితంబై వృద్ధిబొంది ◆ భాసిలుగాకన్.

రచయిత.

ఓమ్

# శ్రీ నిరంజన విజయము

## అధ్యాయము ౧

"విశ్వకర్మఋషిః ప్రజాపతి గృహీతయా త్వయా వాచం
గృహ్ణామి ప్రజాభ్యః ప్రాచీదిశాం వసంతఋతూనా మగ్ని
ర్దేవతా బ్రహ్మద్రవిణం త్రివృత్స్తోమస్సఉపంచదశవర్తని
స్త్ర్యవిర్వయః కృతమయానాం పురోవాతోవాత సానగఋషిః"

—యజుర్వేదము. కాం ౪. ప్ర 3. అ 3.

సుపర్ణ సానగశ్చైవ సనాతన ఇతి స్మృతాః
గురుశ్రేష్ఠోమహాభూనశ్చ ప్రత్నో ధాత్రీసురక్షకః,
విశ్వకర్మ ముఖోద్భూతాః బ్రాహ్మణాః పంచకీర్తితాః
సద్యోజాతముఖే జాత సానగో విశ్వకర్మణః॥

—వశిష్ఠ పురాణము. కాం 3. అ ౬.

ఉ. శ్రీనెలకొన్న యాగమపుఁ ♦ బెట్టున నాదిమశాఖనీడఁ గొ
ల్చై, నిఖిలక్రియాకరణుఁ♦ డై, జగతీ బహుళోపకారసం
ధానవిధా లసద్యశో ముఁదారత దిక్కుల నెల్లనించు సా
సానగమౌని లోకచయ ♦ సన్నుతుఁడౌటకుఁ జిత్రమందునే.

—కల్యాంధకౌముది.

విశ్వవిజ్ఞానముననెల్ల మానవవిజ్ఞానము శిరోమణియై వెలసినది. మానవుఁడు తన జ్ఞానసంపత్తిచే నెల్లభూతముల

నతిశయించుచున్నాఁడు. సామాన్యప్రాణుల విజ్ఞానవికాసములు ఆహారనిద్రాభయాది శారీరక వ్యాపారములలో మాత్రము జాగృతములైయుండ, మానవుని జ్ఞాన తేజము అన్నమయాదికోశముల నధిగమించి, విజ్ఞానమయానందమయకోశముల స్వేచ్ఛావిహారము సలుపునదై తుట్టతుదకుఁ బంచకోశాతీతమై పరబ్రహ్మానంద సంధాయి కాఁగలిగినది. ఇదియును సర్వజన సాధారణముకాదు. ఇంద్రియాటోపముల నడంచి, మానసికవృత్తులను స్వాధీనపఱచుకొని, అతీంద్రియజ్ఞానఘనులై పరఁగిన దివ్యపూరుషులకుమాత్ర మీస్వాత్మానుభూతి! వారే అతీంద్రియ ద్రష్టలైన బ్రహ్మర్షులు!! అశేషజ్ఞాననిధులైన మానీశ్వరులు!!!

ఆ పరమర్షుల జ్ఞానవిజ్ఞానములు నివృత్తిపరములైమాత్ర ముపరమించలేదు. యజ్ఞశిల్పములద్వారమున లోకప్రవృత్తి హేతుభూతములైనవి; సర్వమానవ సంతారకములు కాఁగలిగినవి. ఆదిమఋషులు కేవలము మంత్రపన్నములతోడనే దనిసినవారు కారు. అతిలోకములైన శిల్పముల మూలమున, ప్రజాహితైక జీవనులై, విశ్వమానవకల్యాణమునకు మనోవాక్కాయములను వినియోగించి ఆత్మజీవననిర్వహణమునకై వ్యాకులపడుచున్న జనములకు † శ్రేయస్సును, * ప్రేయస్సును సంపాదింపఁజాలినవారై వెలుఁగొందిరి. కావుననే మన భారత మానవవిజ్ఞానమున ఆర్షవిజ్ఞానసంపద మకుటీభూతమై ఖండాంతరవాసుల కైమోడ్పులనుగూడ నందఁగలుగుచున్నది.

---

† జన్మరాహిత్యరూపమగు మోక్షఫలము.

* అనేకవిధములగు ఐహికఫలము.

లోకప్రవృత్తి పరాయణులై పరగిన అయ్యాదిమ బ్రహ్మర్షి పంచకమున సానగమహర్షి తొల్లింటివాఁడు. మనుబ్రహ్మపర పర్యాయుఁడైన ఆబ్రహ్మర్షియొక్క వంశముననే మన కథానాయకుని యుత్పత్తి. నిరంజనశాస్త్రిగారు ఈశ్వరసంవత్సర ఆశ్వయుజశుక్ల అష్టమి ఆదివారమునాఁడు (14–10–1877) గుంటూరుజిల్లా తెనాలితాలూకాలోని దుగ్గిరాలగ్రామమున శుద్ధశ్రోత్రియమైన వడ్డెపాటివారి కుటుంబములో అవతరించిరి. భద్రాంబికాకోటయ సుధీమణులకు అల్లారుముద్దుగాఁగలిగిన మొదటికొమరుఁడు నిరంజనకవి శేఖరుఁడు. వీరితండ్రి కోటయాచార్యులు స్వగోత్రోచితమగు అయోవృత్తిని (కమ్మరము) చేయు శిల్పి. వివాహోపనయనాది స్మార్తకర్మవిధానములను జదివి చేయించఁగల యాజకుఁడు. వీరికుటుంబమంతగా ధన సంపన్నమయినది కాదు. అయినను విద్యాబుద్ధులకు లోటు లేదుగావున మన శాస్త్రిగారి అభ్యుదయమునకు ఆటంకము లేదు.

## విద్యాభ్యాసము

విద్యాలాలసుఁడగు శాస్త్రిగారితండ్రి అయిదవయేఁటి నుండియే కుమారునకక్షరాభ్యాసముచేసి, తానై విద్య గఱపు చుండెడివాఁడు. పాఠశాలా శిక్షణమున్నను ఇంటికడ పెద్దవారల శిక్షణముగూడ బిడ్డల విద్యాబుద్ధులినుమడింప నుపకరించును గదా. పూవులలోని తావి యెట్లు గంధగర్భమున మణఁగి యుండఁజాలదో, అట్లే శేముషీధురంధరులలోని తెలివి తేటలును లోపల గుప్తములై యుండఁజాలవు. అవి సదా బాహిరప్రపంచమున అలౌకికప్రభలతో వెలుఁగొంద వేగిరపడుచుండును.

అయిదాఱేఁడులచిఱుత తోడిబాలురలోనెల్ల మేటియై తన తరగతిపుస్తకములను శ్రద్ధమెయిఁ జదువుచుఁ దలిదండ్రులను బంధుగులను ఆశ్చర్యచకితులఁ జేయుచుండెడివాఁడు. ఎనిమిది వత్సరములు నిండునప్పటికిఁ బ్రాథమికపాఠశాలలోని చదువు ముఖస్థమయ్యెను. పిల్లవానిబుద్ధికుశలత, సూక్ష్మగ్రహణశక్తి, మున్నగు సల్లక్షణములు పరికించి ఉపాధ్యాయులు, ఇతఁడు ఉన్నతస్థానమునందఁగలవ్యక్తి యని తండ్రిని ప్రోత్సాహపెట్టుచుండెడువారు. ఈ సందర్భమున వీరి చిన్ననాఁటియుదంతమొకటి యుదాహరింతును. శాస్త్రిగారి పదవయేఁట వారి తండ్రికిఁ బక్షవాతవ్యాధి కలిగెను. తాను రోగపీడితుఁడగుటచే రైతులకొఱకై నిర్వహింపవలసిన పనులు సకాలమునకు నెఱవేఱక యిబ్బందులుకలుఁగుచుండ కుమారుని బనిలోఁ బ్రవేశపెట్టుటకు బడిచాలింపఁజేయనెంచెను. ఆవృత్తాంతమును తండ్రియాజ్ఞగా నొజ్జకు నివేదింపఁబోయి తనకష్టములను, చదువు చాలించుటకుఁ దనకుఁగల యసంతృప్తిని రెండుగీతపద్యములలో మనోహరముగా వ్రాసి గురువుగారికర్పించెను. శాస్త్రిగారన్న సత్యాధికాదరముతోఁజూచు నప్పటి వీధిబడిపంతులు మాదిరాజు సుబ్రహ్మణ్యముగారు కుఱ్ఱని కల్పనాశక్తికిని, కవితాపటిమకును అచ్చెరువంది యాతనివెంటనిడుకొని కోటయ్యగారివద్ద కేతెంచి ఈవిషయమును విన్నవించి, ప్రశంసించెను. యోగ్యులును బుద్ధికుశలురునగు శిష్యులు గురుల మెప్పులనందుట సహజమే కదా!

## ఉన్నత విద్యోపార్జనము—శాస్త్రావలోకనము

విద్యాసిద్ధికిఁ గాని, వివిధములగు ఇతర వైభవముల నందుటకుఁ గాని పురుషప్రయత్నముగూడ హేతువైనను, హిందూమతానుసారము విశేషించి పూర్వజన్మసుకృతముండవలయును. కనుకనే కాళిదాసు కుమారసంభవములో "ప్రపేదిరే ప్రాక్తనజన్మ విద్యాః" అని పార్వతీదేవికిఁ బూర్వజన్మమందభ్యసించిన విద్యలే ఈజన్మమునఁ బ్రకాశమునకువచ్చినవని చెప్పియున్నాఁడు. వడ్డపాటివారివంశము తాతముత్తాతలనుండియు విద్యాసంపత్తికలది. ఈవిషయమున దిగువనుదాహరింపఁబోవు పద్యము దార్కాణయగుచున్నది. "ధర్మపాలచరిత్ర" రచనకై దన్నుఁబ్రేరేచిన శ్రోత్రియుఁడిట్లు నుడివినట్లు శాస్త్రిగారు తద్గ్రంథావతరణములో వ్రాసియున్నారు—

సీ॥ త్వత్ప్రపితామహు • తండ్రి భద్రాభిఖ్య
సకల కలాజ్ఞాన • సాంద్రుఁడయ్యె,
ప్రపితామహుండు శ్రీ • పర్వతాహ్వయమున
నయకోవిదులలోన • జయము గొనియె,
నీ తాత యతులసం•గీత విద్యానేత
సుబ్బరాయాహ్వయమున • సొబగు జూపె,
నీ జనకుండవ•నీజన ప్రఖ్యాతి
నతిశిల్పగరిమ కో•టయ ఘటించె,

తే॥ గీ॥ నీదు జనయిత్రి భద్రమ • నీతిచరిత;
నీదు మాతామహునితండ్రి • నిఖిల కావ్య
గీతికాకృతికీర్తి, ల•క్ష్మీపతి తగు;
నీ మనీషాబలమ్మును • నెగడకున్న ?

కోటయ్యగారు కుమారునకెనిమిదవవత్సరముననే యుప నయనసంస్కారము జరిపి తన కత్యంతప్రియమగు వేదాధ్యయ నముఁ జేయింప మొదలిడెను. శాస్త్రిగారు వేదమును, ఉపనిష త్తులను జదువుచు జ్యోతిశ్శాస్త్రమును గేరళమునుగూడ స్వయముగను, అందందుఁ దెలిసినవారి సాహచర్యమునను బెంపొందించుకొనుచుండెడివారు. బాల్యమునుండియు జాతక భాగమునను, ముహూర్తభాగమునను గృషిచేయుచుండుటచే లగ్నములు పెట్టుట, ఇండ్లకాయములు నిర్ణయించుట, ప్రశ్నములు చెప్పుట మొదలుగాఁగల జనోపయోగకార్యములు వీరికిఁ జక్కని ప్రజావశీకరణమును గూర్చినవి.

ఈవిద్యోపార్జనావిధానమిట్లుండఁ దీరికసమయములలో నప్పుడప్పుడు కమ్మరమునుగూడ నేర్చుకొనుచుండెడివారు. తన గోత్రఋషి లోకప్రవృత్తినుద్దేశించి యేశిల్పమునకు నాయకుఁడై ప్రకాశించెనో, అట్టిపావనశిల్పము తనకేల యాచరణీయము కాదు? తత్వార్థమెఱుఁగని పామరజనమునెడ నియ్యది ప్రశం సార్హముగాఁ బరిగణింపఁబడకపోయినను, సనాతనమును, బూజనీయమును గాకపోలేదు. దేశదారిద్ర్యమును బారద్రోలి, దేశక్షేమము నొడఁగూర్పఁగల జీవతేజమగు శిల్పము ఉత్తమ వంశసంభూతున కనుష్ఠేయము కాదని యెవ్వఁడనఁగలఁడు? "శిల్ప మధ్యయనం నామ వృత్తం బ్రాహ్మణ లక్షణం" అను మహాభారతసూక్తి శాస్త్రిగారియెడఁ జక్కఁగా నన్వ యించినది. చదువు చదివి పండితులైనవారు పెక్కురుండ వచ్చును. కాని తమ కావ్యశాస్త్రవాసనలను గర్మవిద్యల

పసిడికి మేళవించి జ్ఞానవిజ్ఞానములచే లోకారాధనముసల్పుచు, ఆదిమఋషుల కీర్తిపతాకములనీడల నుపవిష్టులై ధన్యజీవను లైనవారు ఏ నూటికొక్కరో, కోటికొక్కరో! అట్టివారిలో నిరంజనశిల్పి యొకఁడు. శాస్త్రిగారు కవిత్వమునను, పాండిత్య మునను నిపుణులైన పిమ్మటఁగూడ యాజకవృత్తితోఁబాటు అయశ్శిల్పమునుసైతము చేసి జీవననిర్వాహణము సేయుచుం డెడివారు. చిన్నప్పటినుండియు వృత్తివిద్యలయెడ వారికి విశేషమగు ఆదరముండెడిది. బాల్యమునందలి ఈయభిరుచియే దాను పెద్దయై సంఘసంస్కర్తయయినపిమ్మట ఎట్లు వృత్తి విద్యలను పెంపొందించుకొనవలయునో, వానికి ఏవిధమగు సారస్వతవిద్యల తోడ్పాటు కావలసియుండునో, విచారించి ప్రబోధింపఁ బ్రేరేపించినది.

గోచి పెట్టిననాఁటినుండియు నలవడిన కవితాశక్తి, వేదా ధ్యయనము, జ్యోతిర్వాస్తుశాస్త్రములలోని స్వల్పప్రవేశము, మనుచరిత్రాది కావ్యపఠనము వీరిని సంస్కృతభాషాభ్యసన మునకుఁ బ్రేరేపించినవి. క్రమముగాఁ గావ్యనాటకాలంకారము లలో వ్యుత్పత్తిని సంపాదించిరి. ఈమని గ్రామనివాసులగు జొన్నలగడ్డ రామకృష్ణశాస్త్రిగారివద్ద రఘువంశాదికావ్యము లను, మామిళ్ళపల్లి కృష్ణశాస్త్రిగారివద్ద నాటకాలంకారము లను జదివి కృతకృత్యులయిరి. గాదెరాజు పూర్ణయ్యగారివద్ద స్మార్తపాఠమును జెప్పుకొనిరి. కావ్యసాహిత్యమున కావశ్యక మగు సంస్కృతవ్యాకరణ పాండితిని సైతము గడించినపిదప

అయ్యై శాస్త్రములలోఁ దత్తచ్ఛాస్త్రరహస్యములను సమగ్ర ముగాఁ దెలియఁజాలిరి.

బందరు వాస్తవ్యులగు పర్వతం నృసింహాశాస్త్రిగారు వీరికి శాస్త్రగురువులు. వారివద్ద శ్రౌత గృహ్యా ధర్మసూత్ర ములను, ఆధాన పంచకమును, ఇంక నితరములగు వైదిక క్రియావిధానములను సంపూర్ణముగ నభ్యసించిరి. నృసింహ శాస్త్రిగారు ఒకగ్రామమున స్థాయిగా నివసించెడివారు గారు. ఆయా గ్రామములను దిరుగుచు వెంటనుండు శిష్యగణమునకు మాత్రము విద్య గఱపుచుండెడివారు. అట్టి దేశసంచారియగు గురువు నాశ్రయించి శాస్త్రిగారు కొన్ని విద్యావిషయములను సేకరింపఁ గల్గిరి. వారిరువురకును బ్రతియూరును, బ్రతిపత్తన మును, మార్గములును బాఠశాలలై తనరారినవి. "† విద్యయా సహ మ్రియేత న విద్యామూషరే వపేత్" అన్న సూక్తిప్రకా రము ఉత్తముఁడును దన్నాశ్రయించి కృతార్థత నందవలెనని యెంచిన శిష్యునకుఁగాని నృసింహాశాస్త్రిగారు విద్యాదానము చేయరు. అట్టిగురువునే సేవించి అష్టకష్టములకోర్చి విద్యా ప్రాభవమును సంపాదించిన శాస్త్రిగారు ఉత్తమ శిష్యసమూ హమున కాదర్శప్రాయులై చెన్నొందిరి. ఇంకను శాస్త్రిగారికిఁ గల వివిధ శాస్త్ర పరిజ్ఞానమునుగూర్చి తరువాతఁ గొంత ముచ్చటింతము గాక.

---

† విద్యతోఁబాటు చచ్చినను సరియె కాని, విద్యను అపాత్రునకును, అన్యాయముగ నడుగువానికిని దానము చేయవలదని ఛాందోగ్యోపనిషత్తు.

## అధ్యాయము ౨

### సారస్వత సేవ—కావ్య నిర్మాణము

ఉ॥ మాలికలై కళారుచుల ♦ మాలికలై వలపించి మించు ము
త్యాల తెనుంగుబాస కయి ♦ లల్ చవిజూపెడు నూగునూగు మీ
సాల దినమ్ములన్ సుపరి ♦ పన్మణి పీఠము లెక్కి శంసన
శ్రీల మునింగి తేలు కవి ♦ శేఖరుఁడెంతటి ధన్యమూర్తియో.

"విద్యలలోపల నుత్తమవిద్య కవిత్వంబు" ఇయ్యదియే శాస్త్రిగారి సర్వోన్నతికగు ప్రధాన కారణములలో మొదటిది. కవిత కేవల తర్కకర్కశబుద్ధియగు పండితుని గాని, శుద్ధ ఛాందసునిగాని వరింపదు. కావ్య నాటక లసదలంకారభావ రసికుఁడై సాహితీ హృదయమును దొంగిలించిన కళావేత్తకుఁ గాని కవితాకన్య కైవసము కాదు. కావ్యసంపదనుగూర్చి ఆచార్యదండి యిట్లు వచించుచున్నాఁడు—

> "నైసర్గికీ చ ప్రతిభా శ్రుతంచ బహునిర్మలం
> అమందశ్చాభియోగోఽస్య కారణం కావ్యసంపదః"

సహజసిద్ధమగు ప్రతిభ, చక్కని పాండిత్యము, నిరంతరాభ్యాసము అనునవి మూఁడును గవితకు మూలకందములు. పాండిత్యాభ్యాసములున్నను బ్రతిభ లేనిచోఁ గవిత నిర్జీవము. అట్టివాఁడు పద్యములు వ్రాసినను అవి జీవములేని ప్రతిమలు. ప్రతిభనుగూర్చి ఆలంకారికుల నిర్వచనము—

> "ప్రతిభా అపూర్వవస్తునిర్మాణక్షమా ప్రజ్ఞా"
> "నవనవోన్మేషశాలినీ బుద్ధిః ప్రతిభా మతా"

నిత్యనూతనముగా వస్తువుల సృజించుశక్తి, ప్రతిక్షణము క్రొంగ్రొత్త వికాసముల వెలయించుబుద్ధి ప్రతిభ. వర్ణనీయ వస్తువును సహజస్వరూపమునుండి నూత్నచైతన్య విభ్రాజిత మగునట్లొనర్చి చూపఱయొక్కగాని, శ్రోతలయొక్కగాని దృష్టి నాకర్షించుట ప్రతిభయనఁజెల్లు. అట్టి ప్రతిభ లేనిచో వ్యుత్పత్తి యెంతయున్నను గవిత కుపకరింపనేరదు. అందులకే ఆనంద వర్ధనాచార్యుఁడు ప్రతిభకే మొదటిస్థానము నిచ్చియున్నాఁడు—

"అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః
యస్త్వశక్తికృత స్తస్య స ఝటిత్య వభాసతే"

పాండిత్యము లేమిచేఁగల్గుదోసఁగు కవియొక్క ప్రతిభాశక్తిచేఁ దిరోహితమగును. ప్రతిభ లేమిచేఁగల్గు వైకల్యమో, వెను వెంటనే వెల్లడియగును.

కవితా సంపత్తికి జీవగఱ్ఱయగు తాదృశ ప్రతిభ నిరంజన కవిశేఖరునిలో అప్రతిమముగ నున్నది. కావుననే బాల్యమాది కవితజెప్పుటయున్న వీరికి మంచినీళ్ళప్రాయము.

నిరంజన కవీంద్రుఁడు పదునెనిమిది వర్షముల ప్రాయముననే సరసకవితామార్గమున "కల్యాంధకౌముది" అనుపేర వీరేశ్వరలీలలఁ గొన్నింటిని శ్రవ్యకావ్యరూపమున వర్ణించెను. వీరికృతులలో నియ్యదియే మొట్టమొదటిది. కల్యాంధకౌముదిని రచించునాఁటికిఁ గవికిఁగల యభిప్రాయముం బరికించిచూడ ఆకావ్యమును గొన్ని ప్రసారములుగా వ్రాయఁదలఁచినట్లు దిగువనుదాహరించిన తద్గ్రంథాంత పద్యమునుబట్టి తోఁచెడిని—

మ. ఇది శ్రీనగగోత్ర సంజనిత కోటీశార్య సంతానసం
పద, వీరేశ్వరయోగి పాదయుగ సేవాశీలి, నిర్వ్యాజ కో
విద విశ్వాసి నిరంజనుండు సమవాప్తింజేయు కల్యాంధకౌ
ముదిలోనం బ్రథమప్రసారము ప్రజాహ్లాదంబు సంధించుతన్.

పైగ్రంథమును బ్రసారములుగా వ్రాయనెంచుటచేత నేగాఁబోలు నందు ఆశ్వాసాది విభాగములెవ్వియుఁ గానరావు. ఈప్రబంధ రచనానంతరము కవియొక్కదృష్టి నాటకముపైకి లంఘించినది. అందుచేతనో, లేక మఱేకారణముననోగాని కల్యాంధకౌముదిని వ్రాయఁదలఁచినన్ని ప్రసారములుగా వ్రాయలేదు. వ్రాసిన ప్రసారమునఁ జరిత్రయుఁ బూర్తికాకుండుటచే నవ్వాలి కథను వ్రాయనెంచి కారణాంతరములచే మానినట్లున్నది.

కల్యాంధకౌముది పీఠికలోఁ గవి "ప్రాచీనగ్రంథముల నన్వేషించుసమయమున శ్రీ వీరేశ్వరస్వామి వాక్యానుసార విరచితమగు కాలజ్ఞానమను నొకగ్రంథమును జూడ లభించె ననియు, దానింజూచి తానీపొత్తమును రచించితిననియు" వ్రాసెను. మఱియు "ఈగ్రంథమందలి కథానాయకుని జీవిత గాథనంతయు సంపూర్ణముగ మాచే వ్రాయంబడు "పౌరుషేయ మహాపురుష రత్నమాల" అను చరిత్రగ్రంథమున సవిస్తరముగ వ్రాయఁబూనుటచే నిచ్చోనది వదలివేసితిమి" అనియుఁ బీఠిక యందు వ్రాయఁబడియున్నది. కల్యాంధకౌముదిని సంపూర్ణ ముగా వ్రాయకుండుటకిదియొక్కటిమాత్రము కారణమగపడు చున్నది. అట్లు పీఠికలో వ్రాసియు "ప్రథమప్రసారము" అనుటలో నెక్కడు సామంజస్యము గోచరించుటలేదు.

"పౌరుషేయాన్వయ మహాపురుష రత్నమాలయు" అసంపూర్ణముగనే బొడకట్టుచున్నది. ఆగ్రంథావతారికలోఁ గవి ఇట్లు వ్రాసియున్నాఁడు—

చ॥ ఎఱిఁగి యెఱింగి యిట్లు రచి • యింపఁగఁ బూనినవాఁడఁగాను; నే
నరసినమాత్ర గ్రంథముల • యందలి గాథలతోఁ బ్రవాదపుం
బరిణత గాథలంగలిపి • వ్రాసెద శక్తికొలందిఁ బూర్వపుం
బురుష చరిత్రలిందు గుణ•ముల్ గ్రహియింతురు గాక ధీమణుల్.

క॥ వేదపురాణంబులు సమ
వాదిత్వము గలుగుచోట • వానిని సమకా
లోదయ కథలుగఁ గలిపెద
నాదటఁ దక్కఁగలవన్ని • యట వివరింతున్.

ఉ॥ శాసనముల్ ప్రవాదములు • చాలఁగ భేదములూనుపట్ల నా
యా సమభేదభావముల • నన్ని విమర్శన చేసి సత్యమే
వ్రాసెద,..........................

ఉ॥ ఇందలి సత్కథాగుణము • లెల్లయుఁ బూర్వుల సద్యశస్సుధా
బిందువులే; కొఱంతగల•వే యగునేని మదుక్తిలోపమే;
ఇందుకుఁ బూర్వులందలఁచి • యెగ్గులు వల్కెడువారి సజ్జనా
గ్బృందపు చందమింతె యన•రే గుణశీలురు తద్జ్ఞకోవిదుల్.

గీ॥ రత్నముల నేర్చి మాలికా • రచన సేయు
చున్నవాఁడు నిరంజనా • ఖ్యోల్లసితుఁడు;
పౌరుషేయాన్వయాబ్ధిలోఁ • బరిఢవిల్లు
రత్నముల నేరి నింత్రుఁ బ్ర•యత్నవహులు.

దీనింబట్టిచూడ ఈగ్రంథము నెంతగా వ్రాయఁదలఁచి నదియుఁ దెల్లమగుచున్నది. ప్రథమమునఁ బౌరుషేయ శబ్ద విచారమును జేసి యటుపిమ్మట విశ్వకర్మ త్వష్టలను గూర్చి వేద శాస్త్ర పురాణాగమ ప్రమాణములతో విమర్శించి మనుమయాదుల విషయమును జర్చింపఁబోవు నంతవఱకు మాత్రము ప్రబోధినీ పత్రికలోఁ బ్రకటితమై యున్నది. అవ్వలి చరిత్ర వ్రాసినదియు లేనిదియుఁ దెలియదు. ఎచ్చటను బ్రకటిత మయినట్లును లేదు. కాఁబట్టి యందును గల్యాంధకౌముదీ కావ్య కథానాయకుని జీవితగాథ వర్ణితము కాలేదు. "పౌరుషేయ మహాపురుష రత్నమాల" అవతారికలోని ప్రయత్నముకుఁ దగినట్లాగ్రంథము రచింపఁబడకుండుటకుఁ గారణము తరువాత దాను వ్రాయనెంచిన విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము నను బౌరుషేయ జాతి చరిత్ర ప్రశంసింపఁబడును గాన ఈ గ్రంథరచనమును మాని కవి యందే సావధానుఁడై యుండియుండును. అట్లయినను ఇందు మహాపురుషుల చరిత ములు వర్ణింపఁబడునుగానఁ బ్రత్యేకత లేకపోలేదు. ఏది యెట్లున్నను ఈ కవి రచనలలో అసంపూర్ణగ్రంథములే ఎక్కువయని చెప్పక తప్పదు.

"నాటకాన్తం కవిత్వం" అని నాటకరచనను గవిత్వ మునకు మానదండముగాఁ బెద్దలు నిర్ణయించియున్నారు. కావుననే శాస్త్రిగారిదృష్టి ప్రబంధనిర్మాణముతోఁ దనిసినది కాదు. ఆలంకారికమార్గమునఁ గవితనల్లుచుఁ గబ్బములఁ గూర్చు తాను, సర్వలక్షణ శోభితమగు నాటకమును రచింప

నేలగొంకవలయునని ప్రబంధరచన నాపివైచి "కుమారా భ్యుదయ"మను దృశ్యకావ్యమును వ్రాసిరి.

కుమారాభ్యుదయము ఉత్తమాంధ్ర నాటకములలో నొకటి. శృంగారాంగమగు వీరరసైకప్రధాన రూపకము. ఆలంకారికుల లక్షణములను దృష్టిపథమున నిడుకొని రచించినగ్రంథ మైనను, ఔచితిలోను, కథయొక్క ఐక్యతలోను, లోపములకుఁ దావీయలేదు. సంస్కృతములో భవభూతికవీంద్రుని నాటకరచన కును, ఆంధ్రమున శాస్త్రిగారి నాటకనిర్మాణమునకును గొన్ని పోలికలు గలవు. భవభూతిశైలి నాటకమునకు వలసినకోమలత కించుక దూరమై జటిలమనిపించును. దీర్ఘసమాసభరితమైన కావ్యమార్గమున నాతఁడు నాటకరచనయుం జేసెను. అట్లే శాస్త్రి గారి నాటకరచనయు నించుక జటిలమనకతీరదు. అయినను రసౌ చిత్యమునను, పాత్రపోషణమునను, జిగిబిగిసొంపునను, ఇయ్యది ఏనాటకమునకును వెనుదీయదు. ఇట్లు రచింపఁబడిననాటకమై నను ప్రదర్శన ప్రచారమును విశేషముగా నందలేదు. కొలఁది చోట్ల మాత్రము ప్రదర్శితమైనది. నాటకములు ప్రదర్శన బాహుళ్యమునందుటకుఁ గవిత్వమెంతమహనీయమైనదైనను, కథావస్తువు జనులనాకర్షించునదిగను, మిక్కిలి ప్రసిద్ధివడసినది గను, దేశకాలపాత్రములకుఁ దగినట్టిదిగను నుండవలయును. ప్రస్తుతము ప్రచారములోనున్న నాటకములలోఁ బైనిచెప్పిన గుణములుంటయే వాని యాదరణమునకుఁ గారణము. కుమారాభ్యుదయములోనికథ శైవము. రామాయణ భారత గాథలవలె జనసామాన్యమునఁ బ్రచారములో నున్నది

కాదు. శైలి ఇంచుకజటిలమని మున్నే చెప్పియుంటిని. ఈ కారణములచేఁ గవిత్వము ప్రశస్తమైనదైనను ప్రదర్శన ప్రచారమును విరివిగానొందలేదు. అభిమానులగు కొందఱిచే మాత్రము ప్రదర్శింపఁబడినది. అందొక ప్రదర్శనము గుంటూరు జిల్లా గారపాటిగ్రామమున జరిగినది. ఆసమయముననే శాస్త్రి గారు సువర్ణకంకణ బహూకరణము సందిరి.

ఇంక నితరములగు వీరికృతులు ధర్మపాలచరితము, భీష్మోదయము, సూర్యశతకము, మాఘమాహాత్మ్యము నయి యున్నవి. ధర్మపాలచరితమును "గారపాడు" నివాసులగు కొమ్మూర్మరు * పిచ్చయ్య దీక్షితులుగారి ప్రోత్సాహమున రచింప సమకట్టినట్లు తద్గ్రంథావతరణమునఁ గవియిట్లు చెప్పి యున్నాఁడు.

సీ॥ అమరేంద్రుఁడెవని యాహ్వానంబు వినఁగోరి
జన్నంపుఁ బొగడాగి సన్నుతించు,
పావకుండెవని యధ్వరహవ్యము భుజించి
ఖాండవదహన సంకల్పమూను,

---

* పిచ్చయ్య దీక్షితులుగారు వైశ్వదేవము, అధానము మున్నగు వైదికకర్మలను జేసిన శ్రోత్రియవిశ్వబ్రాహ్మణుఁడు. వీరు, పులివర్తి వీరేశ్వరావధానులు మున్నగువారలప్పటి నైష్ఠికులలోఁ బ్రథమగణ్యులు. పిచ్చయ్య దీక్షితులుగారికిని పర్వతం నృసింహశాస్త్రిగారికిని మంచి స్నేహము. నృసింహ శాస్త్రిగారు శాఖాదురభిమానములులేని సద్బ్రాహ్మణుఁడు. పిచ్చయ్య దీక్షితులుగారి ఆధానక్రియలో వీరును బాల్గొని నిర్వహించిరి.

అతిథు లెవ్వని దేవి • యన్నపూర్ణాదేవి
యనుచు నగ్గించెద • రతుల మతుల,
నిగమంబు లెవని నిశ్ఛిద్ర జిహ్వికఁగూడి
నిర్మల పదసిద్ధి • నేర్పుగాంచె,

గీ॥ అట్టి కౌమ్మారవంశదు • గ్ధార్ణవాబ్జుఁ
డగుచు వెలిఁగెడి పిచ్చయ • యజ్వ నిజ ని
వాస జనపదమగు గార్ల • పాటినుండి
చెచ్చెరను మద్గృహముఁగూర్చి • వచ్చుటయును.

క॥ రాకఁగనుచుం జకోరము
రాకఁగనినరీతి సంతసంబు బొంగన్
మాకుం గలుగు సపర్యల
గైకొనుమని వేడ నవియుఁ • గైకొని పలికెన్.

క॥ సంజేయు పూజలెల్ల వి
ధిం జేయుట జూచి మెచ్చి • తిని; తెప్పఁగ మా
కుం జవులెసఁగఁగ నాకకృతి
నిం జెప్పు నిరంజనాఖ్య • నిరుపమ సఖ్యా!

ఉ॥ చేసితి యజ్ఞకోటిఁ; గడు • చేసితిఁ దత్త్వవిచారకోటియుం,
జేసితిఁ గర్మకోటి, మదిఁ • జేసితి నార్యులబాట సూటిగాఁ,
జేసితి సన్నియున్నిజము • సెప్పెద హృద్గతమైనయట్టి పే
రాస భవత్కవిత్వ రస • మందె తిరంబుగ సంచరించెడున్.

క॥ సత్కులమునఁ బుట్టితి విల
సత్కవితాశక్తి నీకు • సమకూరెను. యు
ష్మత్కల్పనంబు జూడఁగఁ ద
త్కల్ప సుమోపరచులఁ • దాల్చుటయరుదే.

ఈవిధమున నాయజ్వ కావ్యకల్పనకుం బ్రేరేచ నిరహం కారి గావునఁ దనయందట్టి పాటవము లేదని పెద్దలయెదుట నడఁకువం జూపింపఁగాఁబోలు నిట్లు నుడివెను——

“ కావ్యకల్పనా వైదుషీవిధంబునకు సంశయించు మద్వదనం బాలోకించి వెండియు నిట్లనిరి. ”

మ॥ ఇదమిత్థంబని సర్వశాస్త్రముల నూహింపంగ నెవ్వానికిం
బిది యిట్లుంచుము; పూర్వకావ్యముల లేఁబే ర్దోసము ల్లోకమం
దుదితంబేకద యాజకస్త్రీయము బాఁణోచ్ఛిష్ట మన్మాట నె
మ్మదితోఁజెప్పుము సంశయింపక జగన్మాన్యంబు కావ్యంబగున్.

చ॥ శ్రుతులఁ బురాణసంహితలఁ జోడితమై విలసిల్లు సత్కథా
తతి గృతిఁగా రచించుచు సుధామధురోక్తులఁ బెల్లుఁజల్లఁ ద
త్కృతి సుకృతుల్ప్రమోదత వహింతురు గావున ధర్మపాల భూ
పతి చరితంబొనర్పుము సభాసదులెల్లరి మెచ్చుకోలుగన్.

ధర్మపాలచరితము ప్రాబంధిక ధోరణిననుసరించి వ్రాసిన కావ్యము. పెద్దన, రామరాజభూషణుఁడు, రుద్రకవి, ముక్కు తిమ్మన్నలోనగు కవులవలెనే దానును అష్టాదశవర్ణనములతో నిండిన మహాకావ్యమునుగాఁ దద్గ్రంథమును వ్రాయనెంచెను. పురవర్ణనము, గజాశ్వాదులయుఁ బుష్పలావికలయు వర్ణ నములోఁ గవి మిక్కుటముగాఁ దన శిల్పనైపుణిం బ్రదర్శించెను.

ధర్మోపేతమును, సత్యశోభితమును, శ్రేయస్సాధన హేతుభూతమును అగు కథావస్తువును సంగ్రహించి “విశ్వ శ్రేయఃకావ్యం”అను సూక్తిప్రకారము ధర్మపాలచరితమును విశ్వజనీన కావ్యముగా రచింప నుపక్రమించెను. ఇందలి కవితా

శైలియుఁ గల్యాంధకౌముదీ కుమారాభ్యుదయములకన్న విలక్షణముగానుండును. కవి కావ్యనాయకునికి ద్రాక్షాపాక మాధురీ సారమును జవిజూపి, తత్తదవసరోచితములగు కైశికీ భారత్యాది వృత్తుల జోలపాటల లాలించుచు, ఇంపుసొంపులు గుల్కు లేగులాబీల మృదుశయ్యల రసానందరేఖల సాక్షాత్కరింపఁ జేసి, శాంతిపీయూష లహరిని గన్నులకుఁ గట్టును.

ధర్మపాలుఁడు ఉత్తమ పురుషార్థ పరాయణుఁడయ్యు శుష్కహృదయుఁడుగాఁడు. రసవన్మూర్తి. ఆతనికి మోక్షపిపాస మెక్కువ. అయ్యది కవిప్రతిభా మహాత్వమున మనకును సిద్ధమే. ధర్మపాలుని యాపిపాస దీర్ప రమావిష్ణులే కేవలము పూన వలసి వచ్చెను. ఆతనికి హృదయశాంతిగల్గుటకు నారాయణుఁడే జగదాదిభూతమగు వృత్తమును వినుపించును. ఈకథ శాంత రసప్రధానమయ్యు నందఱి నాకర్షింపఁగలుగుట కవిలోని యొక విశేషము.

కల్యాంధకౌముదిలోఁ గవి. తనకెట్టి విశేషణమును బ్రయోగించుకొనలేదు. కుమారాభ్యుదయమున గద్యములో "ఇది శ్రీమద్వీరగుర్వనుకంపా సంపాదిత సరసకవితాధురంధర" అని తనది సరసకవితయని చెప్పికొనియెను. ధర్మపాలచరితము లోని గద్యమున "ఇది శ్రీమద్వీరగుర్వనుకంపా సంపాదిత సంపూర్ణ మధురకవితా ధురంధర..." అనిచెప్పికొనియెను. ధర్మపాలచరితమునను, అందలికవిత్వమునను గవికే యభిమానము మెండు. అందుచేతను, మధురకవితా దీక్షతో దానిని రచించుచున్నాఁడుగావునను, అందలికవిత తనకే యబ్బురమని

పించి "సంపూర్ణ మధురకవితా ధురంధర" అనువిశేషణము నుప యోగింపఁ బ్రేరేపించినట్లు దోఁచెడిని.

కుమారాభ్యుదయము—నాటకము. నాట్యసాహాయ్య మున భావుకుల హృదయములను దత్తద్రసమయములనుగా నొనర్చుట నాటకముయొక్క లక్ష్యము. కావున నాటకరచన యందు రసము నుదయింపఁజేయుశక్తి మిక్కిలిగా నుండవల యును. అందుచే నాటకీయగద్యములో సరసకవితాధురంధర యనుకొనుట ఎంతయుఁ దగియున్నది. దీనింబట్టి రసాభి నివేశము శ్రవ్యకావ్యములందుండదాయని సహృదయులు తలంపవలదు. నాటకములోని రససన్నివేశమునకును గావ్య రససన్నివేశమునకును నించుక భేదము గలదని మాత్రమే నా యభిప్రాయము.

శాస్త్రిగారి కృతులఁ బరిశీలించినచో ధర్మపాలచరిత్ర మున నొకవిశిష్టత గన్పట్టును. జటిలతలేని సుకుమారమగు బంధము, గాంగఝురీసదృశ నిరర్గళ ధార, కుసుమకోమలమగు సులలిత శయ్య, సార్థకపదప్రయోగము, రసానుగుణాలంకార ఘటన, సర్వరస సాధారణ ప్రసాదము, శృంగారైకశోభి యగు మాధుర్యము మున్నగు ముఖ్యగుణములు వీరి యన్ని కృతులయందున్నను ధర్మపాలచరితమునను, మాఘమాహా త్మ్యమునను సువికసితములై చరమసీమ నందుకొన్నవి.

ధర్మపాలచరిత్ర మిట్లు జగజ్జేగీయమానముగా రచింప నెంచిన కావ్యమైనను సంపూర్ణతనందు భాగ్యమునకు నోచు కొనలేదు. రెండాశ్వాసముల వఱకు మాత్రము వ్రాయఁబడి

యున్నది. శేషపూరణమునకగు విశ్రాంతిని శాస్త్రిగారు చేకూర్చు కొనుతఱికి భగవానుఁడు దీర్ఘవిశ్రాంతిసే కూర్చెను; పర దృష్టము. "శ్రేయాంసి బహువిఘ్నాని" గదా.

మాఘమాహాత్మ్యము తుదికావ్యము; సంస్కృత పద్మ పురాణాంతర్గతమగు మాఘమాహాత్మ్యమునకుఁ దెలుఁగుసేఁత. మూలగ్రంథము నలుబదియేడధ్యాయముల పరిమితము. పందొమ్మిదధ్యాయములవఱకుఁ దెనిఁగింపఁబడినది. ఆంధ్రీకరింపఁబడిన భాగమునఁ దొమ్మిదివందలకుమించి పద్యములున్నవి.

శాస్త్రిగారు మాఘమాహాత్మ్యము నాంధ్రీకరించి నెఱదాతలగు నిడుబ్రోలువాస్తవ్యులు మహారాజశ్రీ పాములపాటి సుబ్బరాయఁడుగారి కంకితమీయఁ దలఁచెను. తన ఈ యభిప్రాయమును భాషాభిమానియు ఆశ్రితపోషకుఁడునగు సుబ్బరాయ మిత్రుని యెదుట నాశుపద్యములతో వెల్లడించిరి. కవులన్న సహజాభిమానముగల సుబ్బరాయ వదాన్యుఁడు కవిశేఖరుని తలఁపునకేల ఇయ్యకొనకుండును? సర్వలక్షణశోభితయగు కవితాకన్య తనకేలుపట్ట నుద్యమింపఁ ద్రోసిపుచ్చుకొను మందుఁ డెవఁడుండును? నిరంజనకవీంద్రుని ఆ అసమాన మేధాసంపదకును, ఆశుకవిత్వ చాతుర్యమునకును బెల్లు సంతసించి యప్పటి కప్పుడాఱువందలరూప్యములు బహుమానించినాఁడఁట. భాషాభిమానమన్నను, కవిసమ్మానమన్నను ఇట్లుండవలదా! అట్టి అభిమానశీలురగు దాతలుంట, ఎట్టియే పూర్వకవులు కవిరాజులై తనరారిరి.

సుబ్బరాయఁడుగారినిగూర్చి నిరంజనకవిశేఖరుఁ డొక తారావళిని రచించెను. అందాయన గుణగణములు చక్కఁగా వర్ణింపఁబడినవి. సుబ్బరాయఁడుగారు ఏకపత్నీవ్రతుఁడు. ఈ విషయమును వాఙ్మయవీథిలోఁ జిత్రించుటకు మనకవి—

మ॥ ఒకపద్మేక్షణఁ గేలుపట్టితివి ధీరోత్తమశ్రేణికై; యంతఁ జా
లక విశ్రాణనకాంతఁ గూడితి వదేలా? యాపయిన్ గీర్తికాం
తకుఁ జోటిచ్చితి వందుపైఁ గవనకాంతల్ జంటలై వచ్చినా
రిఁక నీ యేకసతీత్వమేమగునో శానీ సుబ్బరాయాగ్రణీ!

అని యాయనకుఁగల దాతృత్వమును సారస్వతాభిరుచినిఁగూడఁ గీర్తించియున్నాఁడు. ఈ సందర్భమున "సుబ్బరాయతారావళి"లోని యొకటిరెండుపద్యము లుదాహరింపనిది కలము ముందునకు సాఁగుటలేదు.

మ॥ అరినిశ్ఛేద్యము నీదుగుట్టు! సకల వ్యాపారసౌకర్య దు
స్తరపాండిత్యము నీదుకట్టు! నిఖిలాశామండలీ మండన
స్ఫురకీర్తిప్రభ నీదురట్టు! ముదిసేల్వుంజెట్టు నీ పెట్టు! బల్
సిరి నీవాకిటి కాటపట్టు! భళిరా! శ్రీ సుబ్బరాయాగ్రణీ!

మ॥ కలుముల్ చిమ్మెడు నీకటాక్షములు దాక్కన్ గబ్బపుంగన్నె ల
గ్గలపుం బ్రేమలఁ జిక్కి యుజ్జ్వలదలంకారక్రియా చాతురీ
కలనన్ దేటి, "ననున్ ననున్ నను ననున్ గామింపవే!" యంచు వి
హ్వలభావంబులఁ మైపయింబడుదు రారా సుబ్బరాయాగ్రణీ!

మ॥ కవితాకన్యక లెందఱో నిను సమాకర్షించి పెంపొందిరం
చు విచారించి, బహుప్రియారతుఁడవై శోభిల్లు నీమాడ్కి వై
భవమబ్బన్ నిజ చాకచక్య నిపుణీభావంబు జూపింప వ
చ్చె వరింపందగు మత్కవిత్వరమణిన్ శ్రీసుబ్బరాయాగ్రణీ!

సుబ్బరాయని గుణగణములను శాస్త్రిగారి కవితా వైఖరిని దెలిసికొనుటకు సుబ్బరాయ తారావళియే చదువవలయునుగాని, యొండు రెండు పద్యము లుదాహరించినమాత్రఁ దృప్తి కలుగదు. ఈ సందర్భమున నొకయుదంతము వ్రాయవలసి యున్నది. సుబ్బరాయఁడుగారు దన్ను గూర్చి ఇతరకవులు వ్రాసిన పద్యములను, శాస్త్రిగారు రచించిన తారావళిని గవులనామములను సూచింపక ఇందేకవిత్వము బాగున్నదియుఁ దనకుఁదెల్పవలసినదని మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారికిఁ బంపిరి. వేంకటరాయశాస్త్రిగారు ఆపద్యసంపుటములను బరిశీలించి సుబ్బరాయ తారావళిలోని కవిత్వము మిన్న యనియు, ఇయ్యది ప్రాచీనులగు శ్రీనాథాదుల కవితాఫక్కిని బోలియున్నదనియు, నిట్టికవులు ప్రస్తుతమాంధ్రదేశమునఁ గొలఁదిగానుందురనియు మిక్కిలి ప్రశంసించి ఆకవితాగుణముల నిరూపించి వ్రాయుచుఁ, దత్కర్తృనామమును వెంటనే దెలియఁజేయవలయునని సుబ్బరాయఁడుగారికి వ్రాసిరఁట*. తరువాత తారావళీకర్త నిరంజనకవి యని తెలిసికొని వేంకటరాయశాస్త్రిగారు నిరంజనశాస్త్రిగారన్న మైత్రితో నుండువారు. వేంకటరాయశాస్త్రిగారికి వీరియెడ స్నేహమును అభిమానమును గలుగుట కింకొక కారణమునుగూడఁ గలదు. కుమారాభ్యుదయములోని కవిత్వము వేంకటరాయశాస్త్రిగారికిఁ బ్రీతికరమైనది. "ఆటలాడినయట్టు లాగడంబునటించి యేలాలతాంగి నుయ్యాలలూపు" అను కుమారాభ్యుదయములోని సీసపద్యమునకు

* వేంకటరాయశాస్త్రిగారు వ్రాసినలేఖ లభింపలేదు.

ముటెసి, వేంకటరాయశాస్త్రిగారు ఏలాలతాంగినుయ్యాల లూపినకవి నిరంజనశాస్త్రిగారు ప్రతిభాశాలియని, జీవితాంతమువఱకును దనమిత్రులతోడను శిష్యులతోడను పలుకుచుండెడివారు. ఔదార్యశోభితుఁడును సత్కవితాప్రియుఁడును అగు సుబ్బరాయఁడుగారు మాఘమాహాత్మ్య కృతిసమర్పణ సందర్భమున నిరంజనకవీంద్రునకు అయిదెకరముల మాగాణి భూమిని బహూకరింతుననియు వాగ్దానమొనరించిరి. కాని గ్రంథరచన తడవైనది. సుబ్బరాయఁడుగారస్తంగతులైరి. మన కవిశేఖరుని భాగ్యపాత్రము భగ్నమైనది. అంతటితోఁ గవి నిస్పృహుఁడై శేషపూరణమునను నిరుత్సాహి యయ్యెను. ఇప్పటికైనను శ్రీసుబ్బరాయ సతీమణి భర్తృమనోరథమును నెఱవేర్చి సారస్వతసేవకును దోడ్పడినదై కృతకృత్యత నందుగాక యని యాశించుచున్నాము.

మాఘమాహాత్మ్యము ముక్కకుముక్క తెనిగింపును, డు, ము, వు, ల చేర్పును మాత్రము గాదు. పురాణేతిహాసముల నాంధ్రీకరించుటలో నన్నయ తిక్కనాదులెట్లు నీరసఘట్టములను వీడి రసవద్ఘట్టములను దెనుఁగుబాసపొంకము దప్పకుండునట్లు లలితగతి నాశ్రయించిరో, శాస్త్రిగారును అమార్గమునే యవలంబించి యాంధ్రీకరణమునకుఁ దిగిరినారలు. శాస్త్రిగారికి శ్రీనాథుని కవనమన్నను, నాచనసోమనాథ భట్టుమూర్తుల రచనలన్నను అభిమానము మెండు. తెనుఁగు నేతలోను, సీసముల ఒయ్యారపు తూఁగుసడకలలోను నిరంజన కవి శ్రీనాథునియట్టివాఁడు. కాశీఖండపుఁ దెనుఁగునేతవలె

మాఘమాహాత్మ్యంధ్రీకరణమును వన్నెకెక్కినది. స్వతంత్ర గ్రంథమువలె నుండునుగాని యాంధ్రీకరణమని చెప్పవలను తెలియుదు. గ్రంథవిస్తరభీతిచే మూలశ్లోకముల నుదాహరింపక రసికావతంసుల తృప్తికై గొన్నిపద్యములమాత్రమిటం బొందు పఱచుచున్నాఁడ.

మాఘమహిమాభివర్ణనము.

సీ॥ పారాడునిసువు లంబ్రపుముద్దుఁబలుకులఁ
గిలకిలలాడు ముంగిళులు గలిగి,
సిరులు దుటారింప ♦ విరిబోండ్లయాటలఁ
దలతల ల్లాడు మోసలలు గలిగి,
పాటుల ప్రామిన్కు ♦ పదబుల మిన్నంది
కనకనల్లాను శుభధ్వనులు గలిగి,
తనివాఱ మెసవి గంట్లునఁ ద్రేంపు నతిథుల
యెడనెడఁదొడరు సందడులు గలిగి,
గీ॥ వెలయు గీముల నిండారు ♦ వేడ్కలలర
రోహిణీదేవి శచియు నరుంధతియు నె
లందిలోకంబులందు పేరంటులగుట
మాఘమునఁ గ్రుంకువెట్టిన ♦ మహిమఁగాదె.

తనకుఁదగిన యిల్లాలితోడి కాపురపుఁగలిమిని గూర్చి——

మ॥ అలరంభాయపుటాలు, సర్వవిధ సౌ ♦ ఖ్యశ్రేణి నీఁజాలు న
ర్మిలిప్రోయాలు తరంగటక్ మెలఁగుచున్ ♦ ప్రేమమ్ము పైనీడగాఁ
బలుకర్ణంబుల తీర్చి యొక్కపనికిన్ ♦ బ్రాల్మాలమిన్ జూచుచో
విలువు న్నీరగుఁగాదె సంయమివరా! ♦ నిక్కంబు యోజింపుమా.

పెండ్లికాలపుఁ బేరంటాండ్ల నిండుసొగసు మనసునకు నచ్చి జాను తెనుఁగున సాజముగ దిద్దిన తీర్పు.

సీ॥ పసిమిజగ్గుల యొడల్ । పసుపునీటఁ దొలంచి,
గడిమకుంగుల రింగు । లడరఁ గట్టి,
జిలుగు పట్టంచు రైకలు గుత్తముగఁదొడ్గి,
వలఁతి కుంకమబొట్టు । లలరవెట్టి,
విరిగుత్తిగుబ్బల । విరిసరుల్ శవణించి,
పలుచ గందమ్ము చెక్కుల నలంది,
క్రొమ్ముడిఁ గెందమ్మి । కమ్మ లిమ్ముగ జెక్కి,
పసపుఁబారాణిని । బదముల నిడి,

గీ॥ మృదులవాక్కుల వినయమ్ము । జదురపఱచి,
కులపురంధ్రులు నట్టింట । నిలచినపుడె,
సదనమతిదీప్యమానమై । సందడించెఁ
బెండిలికిఁ బేరఁటాండ్లతో । నిండుసొగసు.

భీష్మోదయకావ్యము శ్రీ కాట్రగడ్డ వేంకటసుబ్బయ్య గారి కంకితమొసర్పసంకల్పించి వ్రాయఁబడినది. దానినిగూడ అష్టాదశమహావర్ణనములతో నిండిన ప్రబంధముగనే రచింప నమకట్టెను. గ్రంథావతారికలోని కొన్నిపద్యములప్పటి కవి యభిప్రాయము నిట్లు నిరూపించుచున్నవి—

ఉ॥ భంగి నెసంగు బంగరువు।పల్కులె పల్కుల చిల్కలైన, వా
సింగను మాధురీకవన।శిల్ప మనల్పమ యైనఁ, గీర్తిఁజెం
దం గమకించుచో సుభగ।నాయకరత్న విహీన కావ్య భ
వ్యాంగద మెద్దియుం గ్నెగదు। నా యని సంశయమంది వెండియుక్.

సీ॥ ఆడంబరాళుధా।రావధానాదిక
ప్రజ్ఞ విజ్ఞుల భ్రాంతి।పఱచు నపుడు,
అన్యభాషా యోషి।దవలంబనము హెచ్చి
దేశభావ విపత్తిఁ। దెమలు నపుడు,
పూర్వ లక్షణలక్ష్య।ములఁ ద్రోయు నభినవ
వాచాలు రూరక। వదఱు నపుడు,
పొల్లువోయెడు గద్య।ల్లల్లు పెల్లెడ శేఁగి
జన మాన్యత గడంగ।సాఁగునపుడు,
గీ॥ ప్రౌఢ చాతుర్య ధుర్య ప్ర।బంధ బంధు
ర ప్రసాద రసాస్వాద।న ప్రమోద
భరణ చణులైన ప్రభువులు। వడయ నేర
రనుచు మఱిమఱి సందేహ।మాత్మఁగదిరి.

సీ॥ రాజ నరేంద్ర తు • మాజానిచేఁ గదా
నన్నయ శాసనో • న్నతి వహించె,
మన్మసిద్ధినృపాల • మహితుఁడుండినఁగదా
తిక్కన కవివిధి • స్థితి గమించె
వీరభద్రాది భూ • విభులయున్కిని గదా
శ్రీనాథుఁ డధికప్ర•సిద్ధి మెఱసె,
కృష్ణరాయ మహీప • విష్ణు నండను గదా
పెద్దన కవులలోఁ • బెద్దయయ్యె,
గీ॥ మఱియు భూభుజులెంద।ఱందఱి సహాయ
మనుసరించిన కవిచంద్రు। లధికులైరి,
నేఁటి పాశ్చాత్య రాజన్య। నిర్వృతమునఁ
దెనుఁగుఁగబ్బ మథోగతిఁ। దెమలెఁగాని.

వ. అయినను.

ఉ॥ లోకము చిత్రితప్రకృతిం లోఁ భ్రమియించుచునుండు; నిద్ది కా
లాకృతిగాక వేఱొకటి ♦ యౌనె యటుఁగావున నంధ్రవాగ్వధూ
టీ కరకంకణ క్వణ పటిష్ఠ వరిష్ఠ విశిష్ట హృద్య వా
చాకలనంబు తద్జ్ఞుల కొంకప్పటికైన రుచింపకుండునే.

కః అను నిశ్చితమతిఁ దాదృ
గ్జనతా ఘనతా వితాన ♦ సందర్శన హృ
జ్జనితాను తాపభరమున
వనవరతా స్వేమపరత ♦ నక్షాడు ...'చుండేఁగా'

పై నుదాహరించిన కృతిపతి లంభించి కావ్యరచన కుత్సా
హంబు గల్పించి ప్రేరేపించినట్లు నుడివియున్నారు. దీనినిబట్టి
తెనుఁగువారు కవులన్న నాదరాతిశయములు జూపరని తెలియు
చున్నది. ఇట్టివిలాప మాధునికకవులందఱు నించుమించు చేసిన
వారే. అది మన తెలుఁగునాటి దౌర్భాగ్యము. నూటికొక్కఁడో
కోటికొక్కఁడోగాని తెలుఁగు కవిని, తెనుఁగుఁగబ్బమును గౌర
వించి తెనుఁగుఁదల్లిని బూజింపఁడు. ఈ నిరభిమానత మనపెంపు
నకుఁ బెద్దయడ్డంకి.

కవి ఇంత నిస్పృహచెందియుఁ దనది "ఆంధ్రవాగ్వధూటీ
కరకంకణ క్వణ పటిష్ఠ వరిష్ఠ విశిష్ట హృద్య వాచాకలనంబు"
గావున రసజ్ఞుల కొకప్పుడైనా రుచింపకపోదని కావ్యరచన
నుజ్జగించలేదు. ఇదియ కవికుండవలసిన ధైర్యము. భవభూత్యా
దులు నిట్టిధైర్యమునే పూని విజయమునందిరి.

భీష్మోదయమును అసంపూర్ణగ్రంథమే. శంతనుఁడు వేఁటాడుచు గంగాపులినమున విహరించునంతవఱకు వ్రాయఁబడియున్నది.

వీరి యొండొకకృతి నాచేఁ బ్రకటితమయిన "బ్రహ్మానందలీల" అనునాటకము. "ధీనిధి తత్త్వజ్ఞుఁడు తత్త్వానందస్వామి అతులితానందకథాధీనత సమకూర్చిన వాచానివహము"ననుసరించి నిరంజనకవిశేఖర కవితాచిత్రిత మైనదీనాటకము. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారి జీవితకథ ఇందభివర్ణింపఁబడినది. ఇది శ్రీమునగాల సంస్థానాధీశ్వరులగు రంగరావు బహద్దరు వారి కంకితమై బహూకృతినందిన యుత్తమనాటకము.

### కవిశేఖర బిరుదము

నిరంజనశాస్త్రిగారు కల్యాంధకౌముదీ కుమారాభ్యుదయాది కావ్యములు వ్రాసిన పిమ్మట, వారి అసాధారణ కవితావైభవమునుగూర్చి ఆంధ్రపండితు లిచ్చిన అభిప్రాయ విశేషములనుబట్టియు, ఆకావ్యముల రచనానైపుణ్యమును బట్టియు వీరికి "కవిశేఖర" అనుబిరుదము నిచ్చిరి. ఈబిరుదము చీమకుర్తిలో జరిగిన కృష్ణా గుంటూరుమండల విశ్వబ్రాహ్మణ సభలోఁ గొంతమంది కవులును బండితులును గూడి ఇచ్చియున్నారు. ఆంధ్రమునఁ జక్కని కవిత్వము చెప్పఁగల కందుకూరు మల్లికార్జునాచార్యులు బి. ఏ. గారు, ఇంక నితరకవులును ఇందులకుఁ బ్రోత్సాహకులు. కుమారాభ్యుదయము లోని——

సీ॥ మిడిమిడి యెండపైఁ ♦ బడకుండఁ దగురీతి
ఛత్రంబు పట్టు మీ ♦ చండకిరణ!
అలసటఁ జెలుచెమ్మటలఁ డోఁగకుండ విం
జామరల్వేయుము ♦ సరసిజాక్ష!
మహితపూరుష సూక్త ♦ మంత్రపూర్వకముగ
స్వస్తిచెప్పుము ♦ సరోభవతనూజ!
తలిరులు సుమములు ♦ దగుపాత్రములనించి
పరుగులెత్తఁడు ముందు ♦ ప్రమథులార!
గీ॥ పడలునప్పుడు జాగ్రత్త ♦ వృషభరాజ!
బుస్సనక మేన నడఁగు మీ ♦ భుజగనాథ!
మాననీయ తపోవన ♦ మధ్యమునకుఁ
జంద్రశేఖరుఁడరుదెంచు ♦ సమయమయ్యె.

ఈపద్యమును జదివి అందలి 'బుస్సనకమేననడఁగు మీ భుజగనాథ'అను మందలింపునకును, 'తగురీతిఛత్రంబుపట్టుమ'ను వాక్యములోని క్రియావిశేషణముయొక్క విశేషార్థ స్ఫూర్తికిని అచ్చెరువంది, ఇట్టి కవివతంసుని కవిశేఖర బిరుదముచేనైనను ఆరాధింపనిది తెలుఁగుఁదల్లి కినియదా యని మల్లికార్జునాచార్యులు గారాబిరుదముచే శాస్త్రిగారిని గౌరవింప నుత్సుకులైరఁట.

నిరంజనార్యుని కవిత్వమునుగూర్చియు, ఆయన పుస్తకములనుగూర్చియు విమర్శించుటకీ చిన్నిపొత్తమునఁ జోటు చాలదు. అయినను నించుక బ్రస్తావింపనిది కవితాప్రీతి యూరకుండనీయదు. శాస్త్రిగారు నవరసముల నసమానముగఁ గవిత నల్లఁగలరు. వీరశృంగారముల వర్ణనమన్న నిరర్గళము. శృంగార

వర్ణనములోఁ బ్రత్యేకత యున్నది. ఆశువుగఁ జెప్పినను, పదములకుఁ దడవుకొనుట, నిరర్థక పదప్రయోగము మొదలగు అవలక్షణములును, యతిప్రాసములకుఁబడు తంటాలును గించిత్తేని గోచరింపదు. శాంతరసాభివర్ణన సమయములందును, వివిధములగు మానసిక భావములఁ జిత్రించుపట్టులను వీరుచూపు కౌశల మాశ్చర్యకరము. ధర్మపాలుని శీలమును గుణగణములను వర్ణించు సందర్భములోని యొకపద్య మీదిగువఁ గాననగు.

సీ॥ మోముఁ జందురునెత్తి • ముచ్చటాడఁగఁబోఁడు
గమలేక్షణలయందుఁ • గంటదేమొ,
మానసాబ్జములైన • మఱలుగొల్పఁగనీఁడు
చంద్రాస్యలందు మా•త్సరమదేమొ,
నీతిమాటలనైన • నెమ్మిజూపఁగరాఁడు
వగలాడులందలి • పగయదేమొ,
కనకాంగముల స్త్రీల • గాలిసోఁకఁగనీఁడు
సారంగకచల వి•కారమేమొ,
గీ॥ మానవృత్తిని రాజ్యధ•ర్మములు గడపి
లోకభారంబు సవరించు•జోకగాని,
వెస సమస్తభ్రమల్ మది • వెడలఁద్రొక్కి
తనియు మదినుండు క్షో•ణీశతల్లజుండు.

శాస్త్రిగారికి వైదికప్రీతి మెండు. ఇరవు దొరకినపుడెల్లఁ దన శ్రోత్రియత్వమును జూపుచుండును. వేదాధ్యయనము, యజ్ఞకరణము, దానవ్రతాది నియమము మున్నగునవి వారి కవితయందు లెస్సగా వర్ణితములు. ప్రాచీనఋషులయెడఁ బూజ్యభావమును మిన్నుముట్టుచుండును. తన గోత్రకర్తయగు

సానగబ్రహ్మర్షిని స్మరింపనిది ఏ కావ్యారంభమును సేయలేదు. ధర్మపాలచరితలో—

చ॥ ఉరుతర లోకసృష్టి మది ♦ నూనుచు బుజ్జ్నిగమంబులోఁ బరా
త్పరుప్రథమాన నాబ్జముగు ♦ ప్రాగ్ది శఁబుట్టి యఖండుఁడై, చరా
చరములఁబ్రోవఁజాలు లెను ♦ జాతులఁగన్న మహామహుండు మ
త్సురుచిర గోత్ర కర్తయయి ♦ శోభిలు సానగ మౌనిఁగొల్చెదన్.

కుమారాభ్యుదయములో విశ్వజ్ఞబుుషినిగూర్చి—

మ॥ తుణతన్ విశ్వకృదూర్ధ్వ వక్త్రమునఁ బూ ♦ వన్యక్తి లోకైక వీ
తుణుఁడైవెల్గె, హిరణ్మయాకృతి పరి ♦ జ్ఞానంబుపూరించె; బ్రా
హ్మణ ధర్మ ప్రణవాగ మాధ్యయన ము ♦ ద్యత్రీక్షఁగావించె, స
త్ర్పణతుల్ మిక్కిలి లెక్కగైకొనియె; విశ్వజ్ఞర్షి సామాన్యుఁడే?

ఇప్పటి నవనాగరికులకు శాస్త్రిగారికి గోత్రబుషుల యెడఁగల అపారభక్తి యాదర్శమై తనరారుగాక!

మన కవిశేఖరుఁడు వీరగుర్వనుకంపా సంపాదిత సరస కవితాధురంధరుఁడు. చిన్నప్పటినుండియు వీరబ్రహ్మస్వామిభక్తి వీరి హృదిలోఁ బాదుకొన్నది. శాస్త్రిగారు వీరబ్రహ్మోపాసన చేతనే యట్టి కవితావైభవము నందఁగల్గిరి. కావుననే దన తొలి కవిత్వము నమ్మహానీయుని చరిత్రాభివర్ణనముచేఁ బూతము చేసికొని, యంతిమకృతిలోను ఆపవిత్రాత్మునే గొండాడి వాగీశ్వరీ ప్రసాదసిద్ధి వడసిరి.

శాస్త్రిగారు తనబుద్ధిపాటవమును సంఘసంస్కరణమునకును, బత్రికాప్రకటనమునకును, దేశసంచారమునకును, మత విజయమునకును వినియోగించిరేకాని, ఒక్క సారస్వతనిర్మాణ

మునకే ఉపయోగపెట్టినచో సాటిలేని కీర్తిని గడించి, ఇంక అద్భుతమగు నాంధ్రసాహిత్యమును సృజించెడువారు. వారిశక్తి భిన్నభూమికలలో మిక్కిలిగా వ్యయమైపోయినది. అయినను సారస్వత ప్రీతి మెండుగావున నింతటి వాఙ్మయమును నిర్మించిరి. పండితులగువారనేకులు భాషావిషయిక వాదములతోడను, గ్రాంథికగ్రామ్యకలహములతోడను, అసూయావిష్టులై ఒకరి నొకరు దుమ్మెత్తిపోసుకొనుచు లోకమున కుపయోగపడని శుష్కవాఙ్మయమును బెంచుచుండ, శాస్త్రిగారట్టి అసంబద్ధ వాదములకు దూరముగనుండి తెలుఁగుఁదల్లి మెచ్చుకోలునకగు నట్లు భాషాసేవచేసిరి.

విశ్వబ్రాహ్మణసంఘసేవకై, భాషావిషయికముగఁ దనకు లభింపనున్న ఆచంద్రార్కమగు ఇతోధిక దివ్యకీర్తిని సయితము పేక్షించిన మహాత్యాగి నిరంజనకవీంద్రుఁడు. ఈ విషయమును లోకమెంతవఱకు గ్రహింపఁగల్గెనో తెలియదు.

ఈ కవిచంద్రుని కావ్యములలోఁ గల్యాంధకౌముదీ కుమారాభ్యుదయములును, బ్రహ్మానందలీలలును మాత్రము ప్రకటితములు. ధర్మపాలచరితము, భీష్మోదయము, మాఘ మాహాత్మ్యము, సూర్యశతకము నచ్చుకాలేదు. ఉదారులగు భాషాభిమానులాగ్రంథముల నచ్చొత్తించి, ఆంధ్రభారతీసేవ సల్పినవారై తెనుఁగు వాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడుదురుగాక యని కోరుచున్నాను.

శాస్త్రిగారాయాదేశములలో సంచరించునపు డచ్చటి యాచార వ్యవహారములను, వేషభాషాదులను జక్కని పద్యము

లలో శ్రీనాథునివలె వర్ణించుచుండెడివారు. ఇట్లు వారాయా తావుల రసికులప్రేరణచే వ్రాసి విడిచిన పద్యములు లెక్కకు మిక్కిలిగాఁ గలవు. వాని నన్నింటిని సంపాదించినచో నొక పుస్తకముగాఁ బ్రకటింప వీలయ్యెడిది. కాని శాస్త్రిగారట్టి శ్రద్ధవహింపలేదు. వారు జీవించియుండగాఁ గొన్ని హాస్యరస భరితములగు పద్యముల నపుడపుడు చదువుచుండెడువారు. ఇప్పటికైనను అభిమానులగువారు పూనుకొన్నచోఁ గొన్ని పద్యములైనను దొరకకపోవు.

శాస్త్రిగారి ఆశుకవిత్వము సైతము రసము చిప్పిలుచు భావౌన్నత్యము కలదై పండితులఁ దనియింపఁ జాలునదిగను సామాన్యజనము నాకర్షించునదిగను గూడ నుండును. శాస్త్రి గారు రోగగ్రస్తులై నాలుగైదుదినములలో మరణింపనున్న సమయముననను, ఆశువుగా నొకటిరెండు పద్యములు చెప్పిరి. మనస్సు స్వాధీనములో లేమిచేతనో వ్యాధిభరముచేతనో యొకటి రెండు దోసఁగులతోఁ బద్యములు పూర్తియయినవి. ఎంతటి చిరకాలాభ్యాసమున్న మృత్యువాసన్నమైన యట్టితఱిలోఁ బద్యములు చెప్పఁగలుగుట. ధన్యులు ! నిరంజనశాస్త్రిగారు ధన్యతములు !! అజరామరమైన యశశ్శరీరములో నలరా రుచు "జయంతి తే రససిద్ధాః కవీశ్వరాః"!

---

## అధ్యాయము 3
### మిత్రలాభము

వివిధవిషయములతో సంకులమైయుండు మానవుని మనస్సును వినోదింపఁజేయుటకును, దానిని సన్మార్గమునకుఁ ద్రిప్పి కార్యశూరత నెలకొల్పుటకును, మంత్రినాఁడగు సహ ధర్మచారిణి యెట్టిదో ఉదాత్తగుణశోభితుఁడగు మిత్రుఁడు నట్టి వాఁడు. సత్కళత్రము, సన్మిత్రుఁడు, సత్పుత్రుఁడు ఈమువ్వురే మానవజీవితమును ఆనందకందముగఁ జేసి, శాంతిసౌఖ్యములను జవిజూపఁగలవారు. పురుషుఁడు ఎట్టికష్టములఁ బడుచున్నను వానినన్నింటిని దృణప్రాయములుగ ధిక్కరించి, తాను సాధింప నెంచిన ఘనకార్యముల ఫలమును శీఘ్రమున నందఁగల్గుటకీ మువ్వురే సహాయభూతులు. అట్టిమువ్వురిలో యోగ్యురాలగు భార్య శాస్త్రిగారికి లభించెను. పోఁగా నిఁక సన్మిత్రుఁడు. అట్టి చెలిమికాఁడును శాస్త్రిగారి ఘనాశయములు నెఱవేఱు సమయమున కేల లభింపకుండును ?

బందరుపట్టణనివాసులు, ఆంగ్లవిద్యా విరాజితులు, సుగుణగణాలంకారులు బ్రహ్మశ్రీ † కొండిపర్తి వీరభద్రాచార్యులుగారు మనకథానాయకునికిఁ బరమాప్త మిత్రులు కావలసియున్నారు. శాస్త్రిగారిగురువులలో నొకరగు పర్వతం నృసింహశాస్త్రిగారిది బందరని మున్నే చెప్పియుంటిని. నిరంజన శాస్త్రిగారి శాస్త్రాధ్యయనము బందరునందు జరిగినది కామిం జేసి, ఆచార్యులుగారితో సమావేశము పొసఁగినది కాదు.

† ప్రస్తుతము సన్యాసాశ్రమమునను్న శ్రీశ్రీశ్రీ కళ్యాణానందస్వాములవారు.

వీరభద్రాచార్యులుగారు నృసింహశాస్త్రిగారిద్వారా నిరంజ నాయ్యని తెలివితేటలు, శాస్త్రవైదుష్యము, వాదప్రౌఢిమ, బుద్ధికుశలత, మున్నగువాని నపుడపుడడిగి తెలిసికొనుచుం డెడువారు. శాస్త్రిగారి అత్తవారిల్లు సుప్రసిద్ధమగుకొల్లూరు. వారచట పురాణకాలక్షేపము, కవితాప్రసంగము చేసియుం డిరి. వీరభద్రాచార్యులుగారు కొల్లూరుహైస్కూలునం దుపా ధ్యాయులుగా నుండుతఱి శాస్త్రిగారినిగూర్చి వినుచుండెడి వారే కాని చూచి మాట్లాడుట యెన్నఁడును దటస్థించలేదు. నిరంజనశాస్త్రిగారును, వీరభద్రాచార్యులను నొకస్వజాతి వ్యక్తి, శేముషీధురంధరుఁడు, ఆంగ్లభాషామనీషికలఁడని ఆయన దర్శనార్థ మువ్విళ్ళూరుచుండెడువారే. ఎందులకీ చూడవలయు నను అత్యాశ? తనహృదయమును క్రుంగఁజేయునట్టి సంస్కరణ భావములకు, ఘనాశయములకు దోహదము చిక్కునేమో యనియే! సమకాలికులలో సంస్కృతాంధ్రములఁ బాండిత్తి గడించిన విశ్వబ్రాహ్మణ విద్వాంసులున్నను, ఆంగ్లమున నిపు ణుఁడై సద్భావములుకల వ్యక్తియొకఁడు తనచెలికారమునకుఁ గావలయునని శాస్త్రిగారితలఁపు. అట్టికోర్కెయే సఫలమగు సమయ మాసన్నమైనది.

వీరభద్రాచార్యులుగారు కొల్లూరు పాఠశాలనుండి రాజమహేంద్రవరము కాలేజీలో ట్రైనింగు చదువుటకు, తెనాలిమీఁదుగా రాజమందిరమునకేగుచుండిరి. నిరంజనశాస్త్రి గారు గృహసంభారముల మూటలను మూఁపుననిడుకొని, తెనాలినుండి స్వగ్రామమగు దుగ్గిరాలకుఁ బయనించుచుండిరి.

రైలుస్టేషనులో ముందుగాఁబోవు ఇద్దఱు నాయకావతంసుల శుభసమావేశము. అది యదనుగా కులమాత ఇరుగురి యుత్తమాంగములను ఆశీరక్షతలు చల్లినది. "వాంఛాఫలసిద్ధిరస్తు" అని యొక మేల్మిఁదీవన. తథాస్తు ! ఇంతకన్నఁ గావలసినదేమి ? ఒకరిముఖము నొకరు ఆత్మభావముల నైక్యతసంధిల్లఁ దేఱిపాఱఁ జూచుకొనిరి. అయ్యది 1907 వ సంవత్సరము మార్చి మాసము లోని పదుమూఁడవరోజు.

మన క్రొత్తనెచ్చెలు లిరువురు బండిలో దుగ్గిరాలవరకుఁ బయనించిరి. ఏమేమి రహస్యములను మాట్లాడుకొనిరో, ఎట్లాత్మల నైక్యను నూల్కొల్పిరో ఎవరికిఁ దెలియును ? భావికాలమునఁ గర్మయోగ దీక్షాబద్ధులయి సలిపిన మంచిపనులే వారి నేస్తముయొక్క మొదటిమాటలివి యని యూహింపఁ జేయవలయును.

## ప్రబోధినీ పత్రికాస్థాపనము

నిరంజనశాస్త్రిగారిది సంస్కరణ పూర్ణహృదయము. ఏజాతిగాని, ఏ సంఘముగాని, ఏమతముగాని, తన యూపమును దానెఱుఁగని అధమస్థితిలో నుండుట వారి కిష్టముండదు. అన్నికులములును విద్యా నైతిక రాజకీయాది విషయములలో సమాన గౌరవమును సంపాదించి నపుడే — సమానాభ్యుదయమును బొందఁగల్గిన నాఁడే హిందూదేశము తనయొక్క గొప్పఁదనమును దేశదేశాంతరములకును జాటఁగలదని వారితలఁపు. తుట్టతుదకు ఉన్నతజాతులు ఉన్నతసంఘము లేగాక, కట్టగుడ్డ, కుడువఁ గూడును లేనట్టి బీద

జాతులు సైతము చదువుసంధ్యలు గలిగి మనవలె ననియే తన యభిప్రాయ మైనట్లొకసారి ప్రసంగవశమున నాతోఁ జెప్పి యుండిరి. శాస్త్రిగారి కట్టి బుజుదృష్టియుండుటచేతనే ఏ జాతిని గాని, ఏ సంఘమునుగాని, ఏ మతమునుగాని, తుట్టతుదకే వ్యక్తినిగాని తూలనాడుట వారిస్వభావమున లేదు.

లోకమునంతటిని సంస్కరింపఁజాలు ఊహాజాలము మనస్సున నుండునే కాని సామాన్య విద్యాజ్ఞానములుగలవ్యక్తికి, ధనాఢ్యుఁడు కానివానికి అవి సాధ్యమా? కాదు. అయ్యది ఆత్మ శక్తిని నిండారసంపాదించిన ఏ గాంధిమహాత్మునివంటి పురుషో త్తమునకో సాధ్యము. అట్టివారికిని గాలవ్యవధి అవసరమయి నట్లు నేఁడు మనకన్నులతోఁ గాంచుచున్నారముకదా!

శాస్త్రిగారి ఈ సద్భావములు ఫలించుటకు విశ్వబ్రా హ్మణసంఘక్షేత్రము తగియున్నది. తనజాతిని మాత్రము బాగుగా సంస్కరించి అభ్యున్నతికిఁ గొంపోవుదమని ఎంచిరి. నిద్రాముద్రితులై శిల్పి బ్రాహ్మణధర్మములను, శిల్పమాహాత్మ్య మును విస్మరించి, స్వార్థపరులైన వారి ఎత్తిపొడుపులకు హేళనలకుఁ బాత్రులై దైన్యజీవనము చేయుచున్న స్వసాంఘి కుల మాంద్యమును బాపుటకు, సంస్కరణశంఖమును బూరింప శాస్త్రిగారికి దివ్యసంకల్పము కలిగినది. ఏ మార్గమున జాతిని సంస్కరింపవలయును ? ఎట్లు సంస్కరణోద్యమము ప్రారంభిం చిన అది అన్యసంఘములకు సైతము మార్గదర్శకముకాఁగలదు? ఈ యూహాలతోఁ దన మొదటికార్యక్రమమున "ప్రబోధిని" పత్రికను స్థాపించిరి.

మొట్టమొదటగాఁ బత్రికను నెలకొల్పుట దూరమాలోచించి చేసిన పని. ఎందువలన నన? తనభావములను జనులలోఁ బ్రవేశపెట్టవలసియున్నది. అందుల కూరూరను, బ్రతి పట్టణమునను బ్రచారము చేయవలసియుండును. అట్లు ప్రతి గ్రామసంచారము సేయుటయన్న ధనవ్యయముతోఁగాని సాధ్యమగు పనిగాదు. తాను సామాన్యకుటుంబి. ధనధాన్యసంపదలవ్వారిగాఁ గలవాఁడు గాఁడు. పోఁగా నిఁకఁ జేతివృత్తుల మూలముననో యాజకత్వమువల్లనో, ధనముగడించి యట్లు సేయవలయును. ఒకవ్యక్తి కేవలము స్వార్జితమగు విత్తముతోఁ గుటుంబమును బోషించుకొనుచు, సంఘసేవను సైతమా ముల్లె తోడనే యొనర్చుట కష్టతరము. కావునఁ బత్రికాసహాయమునఁ బ్రచారముసేయ నెంచెను.

తనసంస్కరణాభిలాషలను నెఱవేర్చుకొనుటకా కాలమునఁ బత్రికలు లేవా? యని పాఠకు లడుగవచ్చును. అపుడు 'ఆంధ్ర, కృష్ణ' మున్నగు పత్రికలు కొలఁదిగ మాత్రమున్నవి. అవి దేశవార్తలకును రాజకీయములకును నెలకొల్పఁ బడినవి. వానిలో ఒకసంఘమునకుఁ జెందిన వార్తా వ్యవహారములను ఎక్కువగాఁ బ్రకటించు నవకాశ ముండదు. ఒకజాతియొక్క ఉన్నతికిఁ గృషిచేయు పత్రికయన్న నించుమించు దాని శరీరమంతయు నాజాతికే యర్పితమై యుండవలయును. మఱియు మన దేశమున జాతిద్వేషము, ఎదుటిసంఘముయొక్క గొప్పఁదనమున నసూయ, పరాభ్యుదయమున కాటంకములఁ గల్పించుట అను వేరుపురుగులవంటి దుర్గుణములు నేఁడలంతిగా నున్నను,

నాఁడు వ్రేళ్ళు పాదుకొనియున్నట్లు చూపు నించుక ముందునకుఁ ద్రిప్పినఁ బొడకట్టును. అందుచే ఇతర పత్రికలయందుఁ జోటు చిక్కుటయు అసాధ్యము.

ఇట్టి విషమస్థితులలో సంఘాభ్యుదయమునకై ప్రబోధినీ పత్రికావతరణము. పూర్వము నుడివిన ప్రతిబంధకములున్నట్లును, అది కారణముగాఁ దన భావములు ఫలించుటకుఁ దానీమార్గము నవలంబించినట్లును నిరంజనశాస్త్రిగారే ప్రబోధిని మొదటి సంచికలో "స్వవిషయ" మను పత్రికాప్రాస్తావికయందిట్లు వ్రాసియున్నారు.

"ఈకాలమున దేశభాషాభివృద్ధిఁ గోరుపెక్కండ్రు స్వదేశ భాషచే వార్తాపత్రికలఁ బ్రచురించుచుఁ దమ తమ యుత్సాహము కొలఁది దేశభాషాభివృద్ధిఁ గూర్చి ప్రోత్సాహపఱచుచున్నారు. అటులనే ఈ యాంధ్రదేశంబునఁ గూడఁ బత్రిక లెక్కువ బ్రచురింపఁబడుచున్నవి. కాని కొన్ని పత్రికలందుఁ గొలఁది సంఘములకే యుపయుక్తములగు వ్యాసముల వ్రాయుచుఁ దదితరసంఘముల వారికి మనసు కలఁత నొందించుచున్నారు. అది మొదలుకొని స్వసంఘాభివృద్ధినిగోరు నా యుద్దేశ్యమునందుఁ జింతాకూరము లంకురించి వ్రేళ్ళునాటి మెండుగ నభివృద్ధి జెందినవి. కాని ఈ విషాదవృక్షముం బెకలింప విద్యాధనముల నత్యల్పుఁడనగుటచే నలవడినది కాదు. ప్రపంచమున నెన్ని వెతలనైనను నువ్వెత్తుగ మీటివేయువారు మిత్రసత్తము లేకావున ఈ విషాదము నామిత్రులు తెలిసికొని,

ఈపత్రికా ప్రచురణమునకుఁ బురికొల్పిరి." శాస్త్రిగారి ఈ నుడువులం బట్టి పత్రికాస్థాపనాభిప్రాయము దెల్లము కాకపోదు.

"ప్రబోధిని" పత్రిక 1907సం॥ ఆగష్టుమాసమున నెల కొల్పఁబడినది. నిరంజనశాస్త్రిగారు మొట్టమొదటఁ బత్రికాసంపాదకత్వమునకుఁ దన్నుదాఁదగననుకొని సాటిచెలికాఁడగు వీరభద్రాచార్యులుగారిని సంపాదకులుగా నుండుమని కోరిరి. కాని ఆచార్యులుగారు సైతము సంస్కరణాభిలాష, భాషాసేవాభిరతిగలవారైనను దాను గళాశాలలో నుండుటచే నిందుల కిచ్చగింపక నిరంజనార్యునే యుండుమనియు వలసినసాహాయ్యముఁ దాను జేసెదననియుఁ జెప్పిరి. చెప్పిరేకాని సంస్కృతాంధ్రములను మాత్రము చదివినవారు సామాన్యముగ ఛాందసులుగా నుందురను లోకములోని అపోహ లౌకికజనసహజమగు పత్రికానిర్వహణమున శాస్త్రిగారు విజయమునందఁగలరాయను సందియమును వీరభద్రాచార్యులుగారికిఁ గలుఁగజేసినది. కాని పత్రికవెలువడి సాంఘిక, సారస్వత, నైతిక, శైల్పికాది సర్వవిషయములను గూలంకషముగాఁ బ్రచురపఱచునదై యనతికాలముననే లోకుల మన్ననల నందఁగల్గెను.

పత్రికను నెలకొల్పుటలో ముఖ్యోద్దేశ్యములగు, విద్యాభివృద్ధిచేయుట, ఐకమత్యముం గల్గించుట, దేశోపకారకములును, గులవృత్తులునగు పంచశిల్పములలోఁ బ్రోత్సాదనముం జెప్పుట, శ్రుతిస్మృత్యాదులయందు విశ్వబ్రాహ్మణులకుఁగల అధికార స్వాతంత్ర్యముల వివరణము, సారస్వతసేవ మున్నగునవి అప్రతిహతముగా నెఱవేఱినవి. ఈ

పత్రికానిర్వహణమున శాస్త్రిగారికిఁ జేదోడు వాదోడుగాఁ బనిచేసినవారిలో ముఖ్యులు వెలగలేటి పూర్ణయ్య, పండిత యలవర్తి ఆంజనేయశాస్త్రి, శ్రీరాం సుబ్రహ్మణ్యము, మంగళాపురపు లక్ష్మీనారాయణగారలు. వీరభద్రాచార్యులుగారు ప్రచ్ఛన్నముగానున్న రెండవ సంపాదకులే గావున వారిమాట వేఱుగా వ్రాయనక్కరయే లేదు.

పత్రికాప్రశంస సందర్భమున నొక్కటి చెప్పవలసి యున్నది. మన నేత్రకాంద్రిరువురు ఏకమై, ఇరువురుకవు లెట్లొక పద్యమును అవధానకౌశలమునఁ బూరింతురో, అట్లే వ్యాసములు వ్రాయునపుడు చెఱొకవాక్యమును వేసి విచిత్రావధానమునేయుచు వ్యాసములఁ బూర్తిచేయుచుండెడువారు. అందును ఒకరినొకరు మించవలయునను దలఁపుతోఁ బూర్వవాక్య సంబంధము దొలఁగనీక, ఉత్తరవాక్యమున రెండవవారి యూహ కందికలేని భావమును గూర్చుచుండెడువారు. అట్లయినను ఒకరికొకరు విద్యాబుద్ధులలోను, భావసంపదలోను, కళాకౌశలమునను దీసిపోని చదువరులగుటచే ఇట్టి రచనావినోదముతోడనే వ్యాసములు ముగియుచుండెడివి.

కృష్ణా గుంటూరుమండల విశ్వబ్రాహ్మణ మహాసభ.

నిరంజన బుధుఁడు తన సద్భావములను నెఱవేర్చుకొనుటకగు సాధనములలోఁ దొల్లింటిదగు పత్రికాస్థాపనముం జేసినాఁడు. దానిమూలమున ఆయాభూమికలలోఁ గొంత కొంత సంచలనముం గలిగించెను. స్వసాంఘికుల నెల్ల నేకీభవింపఁజేసి, తన యాశయములను, సంఘములోని కవిపండితులయు,

పెద్దలయు నభిప్రాయములను ఏకీభవింపఁజేసి, భావిభాగ్యము నకుఁ గ్రొత్తమార్గములను ద్రొక్కినఁగాని కార్యరంగమున రెండంజలైన వేసినట్లుగాదు. కాఁగా అందులకగు సాధనోపాయ ముల సేకరించుకొని యుద్యమ మారంభింపవలయును.

ఎల్లవిశ్వబ్రాహ్మణుల యభ్యున్నతియే దన కిష్టమైనను, సత్కార్యములందు విజయము సులభముకాదు గావున, మున్ముందు "కృష్ణా గుంటూరు మండలద్వయ విశ్వబ్రాహ్మణ సభ" నేర్పఱుపఁ దలపెట్టెను. ఆ సంఘక్షేత్రమును సర్వలక్షణ శోభితముగా సంస్కరించినచో, దాని నాదర్శముగా నిడుకొని యితరమండలములవారును సంస్కరణోద్యమములు సాగించి కృతార్థులు కాఁగలరని వారి యాశయము. మండలద్వయ మహాసభ నేర్పఱుచుటకు ఒక్కపత్రికాప్రచారము చాలదు. కొందఱు వ్యక్తులు నడుములు కట్టుకొని గ్రామగ్రామమునకుఁ దిరిగి, సభయొక్క అవసరములను నిరూపించెడు ప్రబోధోప న్యాసములను జేయుచు, ఉద్యమ తత్త్వమును జనసమూహము నకుఁ దెలియఁ జేయవలయును. అధికమగు వ్యయప్రయాసములు పడి ఎట్లెట్లో ప్రచారము సేయఁగల్గిరి. సభ గుంటూరునందో లేక కృష్ణాజిల్లాకు ముఖ్యపట్టణమగు బందరునందో మొదట జరిగినఁగాని, చిన్నపట్టణములందును, గ్రామములందును జరుగు టకు వీలుండదు. అందుకు మొదటగా బందరుపుర ప్రముఖులే పూనుకొనిరి.

ఏసదుద్యమమైనను "శ్రేయాంసి బహువిఘ్నాని" అను నట్లు అంతరాయములు లేనిదిగానుండదు. అంతియేకాక మొద

టగా సర్వజనుల యామోదమును బడయఁజాలదు. కొందఱు బుద్ధిమంతులు కార్యము గట్టెక్క ప్రయత్నములు సేయుచుండ, మఱికొందఱు గుణవంతులు చెఱుపులు బఱుపఁ దివురుచుం దురు. ఇది లోకసహజముకాని విరుద్ధమెంతమాత్రమును గాదు.

బందరుపుర ప్రముఖులలోనే కొందఱు సభోద్యమమున కనుకూలురు; మఱికొందఱు ప్రతికూలురు. సభానిర్మాత లలోఁ బ్రథమగణ్యులు శ్రీ వీరభద్రాచార్యులుగారును, శాస్త్రిగారునే. అది జాతీయోద్యమము మెలమెల్లగా విజృంభిం చుచున్న కాలము. అప్పటినాయకులు దేశాభిమానపూరిత హృదయులు. వారిభావములు ప్రజాదరమునంతగాఁ బడయ కున్నను దేశక్షేమమును గూర్చునట్టివిగను, ప్రభుత్వమునకు వ్యతిరేకములుగను నుండుచుండును. వీరభద్రాచార్యులు గారిలో శాస్త్రిగారికంటెను జాతీయభావము లెక్కుడు. ఈ స్నేహితుల సభాకార్యము రాజద్రోహమగునేమో యని పెక్కురు భయపడిరి. అందుచే ఆటంకములుప్పతిల్లినవి. ఇయ్యది రాజద్రోహవిషయముకాదు, సంఘముయొక్క బాగోగులను విమర్శించుకొను సభయని ఎంతచెప్పినను వినరైరి. ఈభయము విద్యాబుద్ధులుగలిగి యుద్యోగములు చేయువారిని సైత ముఱ్ఱూఁతలూపినది.

మఱికొందఱు విఘ్నకారులు సత్కార్యమన్న వెను దిరుగుబుద్ధిమంతులు, లేదా పెఱవారి గొప్పఁదనమును సహింపలేనివారైనఁ గావచ్చును. ఈరెండు శాఖలవారును సభాకార్యక్రమమునకుఁ బ్రతిక్షణమును విఘ్నములఁ గూర్చు

వారైయుండిరి. వీరుచేయు సభాప్రారంభము ప్రభుత్వము నెదిరించునది గాన విశ్వబ్రాహ్మణులెవరును నింపు జోక్యము కలిగించుకొనవలదనియు, వీరభద్రాచార్యులుగారు జాతీయతా దృష్టిగల యుత్సాహి, అట్టివారి యుద్రేకము సంఘమున కనర్థము దెచ్చుననియుఁ బ్రచారముచేసిరి. మఱియు గుంటూరులో నిరంజనశాస్త్రిగారిని పోలీసువారు అరెస్టుచేసిరనియు, ఇక్కడఁగూడ వీరభద్రాచార్యులుగారిని పట్టుకొని బంధింతురనియుఁ బ్రవాదములు పుట్టించిరి. ఇంకను మొదట నిర్ణయింపఁబడిన సభయొక్క తేదీ మార్పుచేయఁబడినదనియు బందరులో 'కలరా' యున్నదిగానఁ బ్రాణములయందాసయున్నవారెవరును సభకు రావలదనియు, కారణాంతరములచే సభయే ఆఁగిపోయినదనియు, విపరీతముగాఁ గరపత్రముల నచ్చొత్తించి యూరూరఁ బంచిపెట్టుట, సభావిషయమున నుత్సాహులైయున్నవారి మనసులకు విఱుపుగల్పించి పరాఙ్ముఖులను జేయుట మున్నగు ప్రయత్నములవలన శ్రమపడిరి. తుట్టతుదకు శేషటిదినము సభయన నెల్లూరునుండి రానున్న † అధ్యక్షునికి "సభ ఆగిపోయినది రావలదని" టెలిగ్రాముగూడఁబంపిరి.

ఆహా! మంచిపనుల కెన్నిచెఱుపులో చూడుఁడు. ప్రథమ సభాసమావేశమున ఆయుద్యమ ప్రారంభకులైన వీరభద్రాచార్యులుగారు నిరంజనశాస్త్రిగారు పడిన యిక్కట్టులెన్నేనియుం గలవు. గ్రంథము పెరిగిపోవునను తలఁపుచే సంపూ

---

† ఈ ప్రథమ మహాజనసభాధ్యక్షులు (బ్రహ్మశ్రీ) కందుకూరు మల్లికార్జునాచార్యులు, బి. ఏ. గారు.

ర్ణముగా వ్రాయనైతిని. మఱియు రాజద్రోహభయమున సభ కాటంకములు గలిగించినవారి పేరులును అనవసరములని వ్రాయనైతిని.

వారించుటకు వీలుగాని ఈ విఘ్నపరంపరల మేఘములలోనుండియే మెఱపుఁదీఁగవలె సభావిజయలక్ష్మి సాక్షాత్కరించినది. మొదటిసభ 1908 సం॥ ఏప్రిల్ 18-19 తేదీలలో జరిగినది. మొట్టమొదటిసభలో సభ్యులయుఁ బ్రేక్షకులయు సంఖ్య పెరుగకపోయినను, కార్యము అంకురప్రాయముగా నెఱవేరినది. ఆకాలపు ఇతర సంఘనాయకులగు బ్రహ్మశ్రీ చేకుమళ్ల రాజగోపాలరావుగారు మున్నగు ప్రముఖులు సయితము వెక్కిరరుదెంచి వీరి యుద్యమమున కాశ్చర్యచకితులైరి. కారణమేమన? అప్పటిలో ఏ సంఘమునను ఇట్లు కులసభలను నెలకొల్పి సంస్కరణోద్యమములను సాగించుటలేదు. అట్టి స్థితిలో నిది విశ్వబ్రాహ్మణసంఘమున మాత్రము తొలుదొల్తగా మొలకఱించిన ఇతర సంఘములవారికేల యబ్బురముగా నుండదు ?

నిరంజనశాస్త్రిగారు విశ్వబ్రాహ్మణ సంఘసేవకై యొనర్చెడి పత్రికాప్రచారమునకును, సభోద్యమమునకును సంతోషించి, వారి యభిమానమునకును, గష్టసహిష్ణుతకును, సత్కార్యనిర్వహణమునకును బహుమానముగా మున్నంగి వాస్తవ్యులగు మేడూరు కోట్లింగాచార్యులుగారు ఒక ఎకరము మాగాణిని వారి కర్పించిరి. శాస్త్రిగారు ప్రథమ సభాహ్వానమునకై పద్యములనువ్రాసి ప్రబోధినిలోఁ బ్రకటించిరి. ఆ

పద్యములందలి భావావేశమునకును ప్రబోధమునకును అచ్చెరువంది, మొదటిసభలోనే శాస్త్రిగారి కీమాగాణి నిచ్చుచున్నానని వాగ్దానమొసర్చి యట్లు చేసిరి. అందలి పద్యములు ప్రబోధము గల్గుటకును, ఉత్సాహము పెంపొందుటకును త్రికాలములయందును ఉపయోగించునవిగా నున్నవి. శిల్పుల ప్రాచీన అర్వాచీన స్థితినిగూర్చి ఇట్లు వ్రాసిరి.

సీ॥ ఆకాశయానంబు • లమరించువారలు
పొగబండ్లఁ జూచి యాఁ • పొంగవలసె,
సంద్రంబుగట్టిన • సమధిక గుణశాలు
రేటివంతెనలను • నెన్నవలసె,
మదిగొను సభల ని • ర్మాణించువారలు
తంత్రివార్తలఁ జూచి • తడయవలసె,
అఖిలజనంబుల • కాధారులగు వార
లుపజీవికులవలె • నుండవలసె,

గీ॥ విశ్వకర్మాన్వయమున నా • విర్భవించి
కర్మవిద్యలఁ గాటిలోఁ • గలుపవలసె,
అకట ! ఈదైన్యగతి జూచి • రైన మీరు
పోవలెను జుండి ! బందరు • భూరి సభకు.

ఇట్టిపద్యములు దరిదాపు ఇరువదికి మించియున్నవి. సంఘమునుగూర్చి తనకుఁగల భావముల నన్నింటినందుఁ బొందుపఱచియే యున్నారు. ఇంతగాఁ బిలిచినను రాలేమోయను సందియముచే ఒకబెదరింపు. చూడుఁడు.

సీ॥ ... ... ... ... ... ...
బందరందమ్మను • బరికించుటకునైనఁ
ప్రోత్సాహులార రాకుండవలదు,
గీ॥ క్రొత్తపాగ బండిజూచెడి • కోర్కెనైన
నూర్జితంబుగ మీరు రాకుండవలదు
మఱి మఱిఁజెప్పనేలనో • మాన్యులార!
రాకపోయినమాచేత • రట్టుకలదు.

నయమునను, భయమునను గార్యమునకుఁ దివుర ప్రోత్సాహపెట్టెడి ఘనతరాభిమానము నిరంజనార్యునకే చెల్లె!

నిరంజన సంస్కర్త ఏవిశాలభావములతో ఈయుద్యమము నారంభించెనో, ఆ భావబీజము లంకురింపక పోలేదు. మొదటిసభకుఁ బూర్వమే ప్రబోధినిని స్థాపించినారని మా పాఠకులెఱుంగుదురు. అప్పటి సాంఘికాభిమానమును, సంఘస్థితిని బ్రహ్మశ్రీ వెలగలేటి పూర్ణయ్యగారీక్రింది విధమున వర్ణించినారు.

సీ॥ ఉత్తరంబునకుఁ బ్రత్యుత్తరంబును వ్రాయ
వేమాఱు చదువరి • వేఁడవలసె;
బంగారమిచ్చిన • లింగిసెట్టిని జూచి
గోడపైఁ బరిమితి • గోరవలసె;
వ్రాలుసేయు మటన్న • వానకాలపుఁ జదు
వంచు నక్కరముల • నరయవలసె;
చక్కగా నీకమ్మఁ • జదివి చెప్పుమటన్న
కనులకు జోడులే • దనఁగవలసె;
గీ॥ సభకు రమ్మని బిలిచెదు • సమయమందు
ధనము నడిగెదరని యింట • డాఁగవలసె;

పౌరుషేయులసంఘ మీ • పగిదినుండె
ఓ ప్రబోధిని రక్షింపు • ముర్విమీఁద.

—ప్రబోధిని : సంపు ౧ సంచి ౧

ఈపద్యము ప్రబోధముకొఱకై యుద్దేశింపఁబడినది గావున ఇతరుల మనసులు కరగుటకై కవితాచిత్రణమించుక దైన్యమును నిరూపించియున్నది. అట్టి స్థితిలోనున్న సంఘమే ప్రబోధినీ ప్రచారానంతరము, ఒక మహాసభలోఁ ప్రబోధ శంఖము పూరింపఁబడిన పిమ్మట, కనులు దెఱచి ఎట్లప్రమాదముతో సత్కార్యములకై దొరకొన్నదియును, ఈ దిగువ పద్యమును బట్టి తెలియుచున్నది.

సీ॥ ఏయూరఁ జూచిన • నిర్థ విద్యాభ్యాస
పఠన ప్రయాసల • బడెదువారు;
ఏక్షేవవీక్షింప • నెంతయో స్వకుల సం
స్కరణాభివృద్ధికిఁ • జాటువారె
ఏక్షోలఁజూచిన • నెట్టికష్టంబైన
దొరకొనుటకుఁ గాలు • దువ్వువారె
ఏదెసవినఁబోవ • నీద్వితీయమహా స
భాగమనంబుఁ జెప్పురయువారె

గీ॥ పౌరుషేయులలోనిట్లు • పరిణమించె;
కాలమహిమంబొ, గతసభా • ఘనఫలంబొ,
తెలియకుండె మహాశిల్పి • తిలకులార!
రండు రెండవసభకు న • ఖండబుద్ధి.

నిరంజనశాస్త్రిగారు. ప్రబోధిని. సంపు ౨ సంచిక 3

రెండవ సభ, సమావేశమగునంతలో, అనఁగా ఒక సంవత్సరకాలములో అట్టి యభ్యుదయము కలిగినది.

ప్రబోధినీ పత్రిక, మండలద్వయ మహాసభ రెండును క్రమాభివృద్ధి నందుచున్నవి. క్రమముగా శాస్త్రిగారి యభిప్రాయము లాచరణయోగమున సముచితమగు కృతార్థతనందుచున్నవి. మొట్టమొదట విద్యావ్యాప్తి, ఐకమత్యము, సంఘగౌరవము, శ్రుతిస్మృత్యాగమాదులలోని ప్రమాణముల వ్యక్తీకరించుట మొదలగు ఏ అభిప్రాయముల సిద్ధికై పత్రికాసభలు నెలకొల్పఁబడెనో అయ్యవి నెఱవేరుచున్నవి. చేయఁబూనిన పని ఒకటి రెండు విఘ్నములు కలుగుచున్నను గొంతకుఁగొంత ఫలమును బడయుచున్నట్లయిన నెవ్వఁడును ఆకార్యమును బరిత్యజింపఁజాలఁడు. పై పెచ్చు ఉత్సాహామినుమడింపఁ దీవ్రముగాఁ గృషిచేసి సత్ఫలముల నందునుగదా!

నిరంజనశాస్త్రిగారు విశ్వబ్రాహ్మణ సంఘాభివృద్ధికై యారంభించిన పత్రికా ప్రకటనము, సభోద్యమము రెండును ఇతరసంఘముల అభ్యున్నతికి సయితము ఆదర్శములై తనరారినవి. ఎట్లన? శాస్త్రిగారు పత్రికారంభము చేయుటకుఁ బూర్వము ఏసంఘమునందుఁగాని కులపత్రికలులేవు. నాలుగైదు రాజకీయముగను, సారస్వతముగను మాత్రము పని చేసెడు పత్రికలున్నవని మున్నే చెప్పియుంటిని. కాఁగా సంఘసంస్కరణమునకై జాతిపరముగా నెలకొల్పఁబడిన పత్రికలలో మొదటిది ప్రబోధిని యొక్కటియే. అట్టిపత్రికను బ్రారంభించిన వారును శాస్త్రిగారొక్కరే యగపడుచున్నారు. శాస్త్రిగారి

ఈపత్రిక నాదర్శముగా నిడుకొని, తమతమ సంఘములను
బాగుచేసికొనుటకై ఇతరసంఘములవారును కులపత్రికలను
నెలకొల్పిరి. ఏసంఘములందుఁగాని కులమహాసభలును
నాఁడు లేవు. సాంఘికసభలన్నింటికిని ఈవిశ్వబ్రాహ్మణసభయే
దారిచూపినదయి యొప్పినది. ప్రబోధినీపత్రిక వెడలినతరువాత
వైదికి, నియోగి, వైశ్య, రెడ్డి, కమ్మ, పద్మశాలి మొదలగు
జాతులవారు వారి వారి కులనామములతోఁ బత్రికలను
స్థాపించి, వారి వారి సంఘక్షేత్రములను సంస్కరించుకొనిరి.
అట్లే ప్రతిజాతివారును కులముపేరిట మహాసభల నారంభించి
కృతకృత్యులైరి. ఆంధ్రదేశమునకు కులపత్రికలును కులసభ
లును ఆవశ్యకములని చాటి, మున్ముందుగా వానిని నెలకొల్పి
దారిచూపించిన శ్రీనిరంజనశాస్త్రిగారిని దెలుఁగుదేశ మెన్నఁ
డును మఱువకుండుఁగాక!

శాస్త్రిగారి ఈ ఉద్యమమును ఒకరిట్లు ప్రశంసించి
యున్నారు.

"సంఘపత్రికలెందు జననమొందనినాఁడె
సంఘపత్రిక నిల్పఁజాలినావు,
కులమహాసభలెందుఁ గూడకుండిననాఁడె,
కులమహాసభయొండు గూర్చినావు"

ఈ సందర్భమున ఒకభాష మాట్లాడుచు నొకదేశమున
నివసించు జనులకుఁ బరస్పరభేదమును గలుగఁజేయుచుఁ గుల
మునకొకపత్రిక, జాతికొక సభయుంట యనర్థముకాదా యని
ఒక యాక్షేపణ రావచ్చును. కాని కులసభలును, కులపత్రిక

లును అన్యోన్యభేదములకు వైషమ్యములకుఁ దావలములను కొనుట పొరపాటు. అట్టి యుద్దేశ్యముతో వానిని నడుపుటయు యోగ్యమని ఎవ్వరు ననఁజాలరు. కొంతమంది మనుష్యులతోఁ గూడిన కుటుంబమెట్టిదో, కొన్ని జాతులతోఁ గూడిన దేశమును నట్టిదియే. ఒక కుటుంబమునకుఁ జెందిన మనుష్యులలో ఒకఁడు మాత్రము విద్యాధికుఁడై, మఱియొకఁడు నిరక్షరకుక్షియై, వేఱొకఁడు బుద్ధిబలములేనివాఁడుగను, ఇంకొకఁడు సర్వాసమర్థుఁడుగను నుండిన ఆ కుటుంబమెట్లు ఐకమత్యమునకు దూరమై గౌరవభాజనముకాదో, అట్లే దేశములోని ఆయా జాతులవారును విద్యానైతికరాజకీయాది విషయముల హెచ్చుతగ్గులు గలవారై యున్నచో నట్టిదేశ మభివృద్ధి చెందుటయుఁ గష్టతరము. ప్రతిజాతియు సర్వాంగసౌష్ఠవమును గలిగియున్నపుడే, అది దేశకల్యాణమునకు హేతుభూతమగును.

ఒకప్రాణికిఁ గాలుసేతులు మొదలగు నవయవములెట్టివో దేశశరీరమునకు జాతులును నట్టివి. శరీరములోని ఏ అవయవమునకు లోటు వాటిల్లినను ఆ శరీరము కర్మాచరణమునకుపయోగింపనట్లు దేశములోని యేజాతియు నభ్యున్నతియందు లేకున్న నది దేశసౌభాగ్యదాయకము కాదుగదా. అన్నిజాతుల వారును, సంఘములవారును దేశగౌరవమును దృష్టిపథమునఁ బెట్టుకొని ఇతరుల కపకారములు సేయకయుఁ బరుల నిందింపకయుఁ దమ్ముఁ దా ముద్ధరించుకొనుట అవసరము కాకపోదు. అట్టి ఏకైకశాఖాసంస్కరణమునకై కులపత్రికలును, కులసభలును సాధనము లేల కాకుండును ?

ఏ వస్తువుగాని యుపయోగించుకొనుటనుబట్టి మంచి చెడులను గలిగించునుగాని, స్వయముగా మంచిదయిగాని చెడ్డదయిగాని యుండదు. మన ఈ పత్రికలను సభలను సయితము ఋజుదృష్టితో వినియోగించుకొనినచో ఏవిధమైన భిన్న భావములను వైషమ్యములను గలుగఁజేయవు. ఒకసంఘము వారిని వేఱొకసంఘమువారు ద్వేషించినప్పుడు భేదమేర్పడును గాని, సానుభూతిపూర్వకముగా తోడిసంఘమువారికి వారి యభివృద్ధి కనువగు మార్గముల సూచించుచు శ్రేయస్కాములై యుండునప్పు డెట్టి పొరపొచ్చెములును రావుగదా? నీ వెవ్వనినైన భూషించి గౌరవించినచో నిన్నుకారణముగ నాతఁడు దూషింపఁగలఁడా? కావున అన్నిజాతులవారును బరస్పరము సహాయము చేసికొనుచు, ఉపకారపరాయణులై మెలఁగినచో, కులపత్రికలుగాని, కులసభలుగాని ఎట్టిభేదమును బొసఁగింప నేరవు. "పరస్పరం భావయన్తశ్శ్రేయః పరమవాప్స్యథ" అని గీతాచార్యుఁడు బోధించుచుండ భేదములకుఁ దావలమేడ ?

## కు ల ము లు

కులములనుగూర్చి శాస్త్రిగారికీసద్భావము కలదు. ప్రబోధిని మొదటిసంచికలోఁ దనఈయభిప్రాయమును సుస్పష్ట పఱచిరి. అందలివ్యాసభాగమునిటఁ గొంత బొందుపఱచు చున్నాను.

"దయామయుడగు పరమేశ్వరుడు సృజనాచాతురిని జూపి తగునాహారవిధానంబులనొసంగి, సత్య జ్ఞాన దయా శౌచంబులకు దారి చూపినను, వివిధాహారవిధాన మేదోవృద్ధి

వల్లనో, జడస్వరూప మాయాప్రవిష్టము వలననోకాని మనుష్యులు భిన్నమార్గముల, భిన్నసంఘముల, భిన్నమతముల పొంది వేఱువేఱ చరించుచున్నారు. భిన్నగతిబొందిన మనుష్యులు వారివారి ప్రజ్ఞావిశేషములవలన సంఘములనేర్పఱచికొని, అపారతరమగు సంఘీకరణసౌఖ్యముల ననుభవించుచున్నారు. అట్టిసంఘమునకే కులమనిపేరు. కులమనుశబ్దము " కుల్యతే బంధువర్గో అనేనేతి " (దీనిచేత బంధువర్గము కూర్పబడుచున్నది.) అనునర్థము ప్రతిపాదించుచున్నది. అనగా నొకకులమను శబ్దముచే అనేకజనులేకీభూతమూమనస్కులై అన్యోన్యసహాయ సంసిద్ధినొంది సఫలప్రయత్నులగుచున్నారు. కావున కులమను శబ్దము కట్టుబాటుకొఱకే ముఖ్యముగా నేర్పడినది. అట్టికులశబ్దములేనియెడల మనుష్యులు విచ్చలవిడితిరుగుచు పరస్పరసంబంధము లేకయుండెదరనుమాట సత్యము. కులశబ్దవాచ్యములేకయే సర్వసమబుద్ధితో ప్రవర్తించరాదాయనిన, ఈవిషయముకూడా విచారణీయమే. మనుష్యులిప్పటికంటె పూర్వమనాగరికు లగుట మనుస్మృత్యాది గ్రంథములే సాక్షీభూతములగుచు నుద్ఘోషించుచున్నవి. ఎట్టులనిన? మాంసభక్షణము, గోమేధ నరమేధ అశ్వమేధ పౌండరీకాద్యసహ్య యజ్ఞనామ ఘోరవిధానములు, బలాత్కారసహగమనాది భయంకర విచారకృత్యములు, రాక్షస పైశాచికాది వివాహభేదాంగీకారములు మున్నుగలవనిన మన మనసెట్లు కలతనొందునో తెలియకున్నది. వేయేల పూర్వకాలము (అనగా మనుస్మృతి ప్రోక్తకాలము)న బ్రాహ్మణాది

చతుర్వర్ణవిభాగము బ్రహ్మ మనస్సంకల్ప కల్పితమేయని చెప్పుచు, బ్రహ్మసంకల్పవ్యతిరిక్తముగా అనులోమ విలోమ సంకీర్ణాదిజాతు లుత్పన్నమయినవనియు, అట్టిసంకీర్ణయోను లందుగూడ తపోబీజప్రభావముచే జన్మించినవారు బ్రహ్మర్షు లయిరనియు, మనుస్మృతియే వక్కాణించుచున్నది. ఇట్టివిధులు విచారించిన స్మృతిసమయసమీపమునందే వర్ణములయొక్క కట్టుబాట్లు నిర్ణయింపబడుటయు, అట్టికట్టుబాటులకు లోగానని జనుల ధ్రోయలేక, వారిధర్మములగూడ ఒకయుత్తమధర్మముగనే స్మృతికర్తలంగీకరించినట్టుల తోచుచున్నది. స్మృతులెట్లున్నను భారతాదిగ్రంథములయందుగూడ సృష్టియందు ఒకకులమే యనియు, ప్రవర్తనభేదంబులచే కులభేదములు నిర్ణయింపబడె ననియు పెక్కుభంగుల వ్రాయబడినది. వేదకాలమునందు గూడ కులభేదంబులేక ప్రవర్తిల్లెదరనుమాట స్పష్టము. లేనిచో కశ్యపపుత్రులగు దేవదానవులు భేదబుద్ధిచే భిన్నమార్గము పొంది, భిన్నజాతివారనబడుట లోకవిదితమేగదా. స్వర్గ లోకవాసులై దేవతాంశసంభూతులగు నార్యులు భూలో కమున నవతరించి, హిమవత్పర్వత దక్షిణభూముల నాక్ర మించి, ఆర్యావర్తఖండంబున నెలకొనునప్పుడు కుల భేదములేక ఆర్యనామావశిష్టులగుట జగత్ప్రసిద్ధము. కాని జనాభివృద్ధి యెక్కుడగుటచే వేలువేలు తెగల విభాగపడి భేద వృత్తులుకల్పించుకొని భేదకులనామముచే పెంపుచెందిరనుట స్పష్టాంశము. జనవృద్ధియైనకొలది నాగరికాభివృద్ధి పూర్వోక్తి నిర్ణయమేకాన జనులు స్వవృత్తులయందు అన్యోన్యసహా

యమునంటుటకు, ఏకమనస్కులగుటకు కులనామపాశబద్ధులై సంఘీకరణ మొనర్చినచో సఫలమనోరథులగుదురు. కులభేదములచే హిందూదేశవాసులు భిన్నబుద్ధులవాడమి పరస్పరకలహసన్నద్ధులగుచుండ, మండెడునగ్గిలో కట్టియలు వేసినట్లు కులభేద నిర్ణయబోధనము సమీచీనమాయని వితర్కించినచో, నాయభిప్రాయమది కాదని నొక్కి వక్కాణింతును. కులశబ్దమున నింత యాశయమున్నదనియు, కులపాశబద్ధులై సంఘీకరణ మొనరించి, ఆత్మతేజోబలవంతులగుదురని కాని, నిరర్థక కలహసన్నాహసన్నద్ధులై పరకులనిందాజీవనము నొడిగట్టుమనుకొనుట కాదు. ......... కావున ఒండొరులు పరస్పరద్వేషములుడిగి తమ తమసంఘముల ప్రయత్నశీలురై శుభ్రపఱుపగోరుట నా ముఖ్యాశయము."

మఱియు, కులములనుగూర్చి బందరునందిచ్చిన ప్రవాసికోపన్యాసములోఁ దనయభిప్రాయమునిట్లు చెప్పిరి. "ఆర్యులు మొట్టమొదట కులభేదములు లేక ఒకమహాసంఘముగానుండి రానురాను నాగరికత హెచ్చి పలువృత్తుల నవలంబించవలసినవారై, ఆ వృత్తులననుసరించి కొన్నినియమముల నేర్పఱచుకొనిరి. క్రమక్రమముగ నొకవృత్తిఁజేయువారు తమవృత్తి నవలంబించువారితో ప్రేమానుబంధముగలవారగుచు, ఇతర వృత్తులజరించువారిని గొంచెము దూరముగఁజూచుచువచ్చిరి. ఇట్లు ప్రతిచిన్నిసంఘమును తమతమవిధులను, నీమములను, మతకర్మములను విడివిడిగ నేర్పఱచుకొనగా కులము లేర్పడెను.

కులమున కొన్నినీమములచే కట్టువడిన జనసముదాయమని యర్థము."

## రా జ స న్మా న ము

ఏ యుద్యమములైనను ధనవంతుల సహాయము లేనిది నిర్వహింపఁబడవనుమాట రూఢి. ప్రబోధినీపత్రికమూలము నను, కృష్ణాగుంటూరుమండల విశ్వబ్రాహ్మణసభవలనను వీరు సాధింపనెంచినకార్యములలో శిల్పాభివృద్ధియొకటి. అందుకై వలసిన పూర్వశిల్పగ్రంథములను వెదకి వానిని బ్రకటించవలసి యున్నది. ఈ కార్యమునకు దేశదేశాంతరములు దిరుగవల యును; అందందుఁగల గ్రంథాలయములను దడవి పుస్తక సంపాదనము సేయవలయును. ఇది ధనసాధ్యమైన పని. ధన హీనమగు విశ్వబ్రాహ్మణసంఘమిందుకుఁబూనుకొని నిర్వ హించుట కష్టము. కాఁగా ధనసంపన్నులగు ప్రభువులమూల మున ఈ పని నెఱవేర్చుకొనవలసియున్నది. శాస్త్రిగారి కవితా ప్రౌఢిమ, ఆచార్యులుగారి పలుకుబడి రెండునుగలసి ఈ కార్య మును సాధించినవి. పీఠికాపురాధీశ్వరులగు శ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు ఔదా ర్యశోభితులును భాషాపోషకులునైయుండిరి. అట్టివారు శిల్పాభి వృద్ధికిఁజేయు యత్నమునకేల చేయూఁత నొసంగకుందురు ? శాస్త్రిగారి రసవన్మధురకవిత, వీరభద్రాచార్యులుగారి అమృత వాక్కులు ఆ రాజన్యు నలరించినవి. విశ్వబ్రాహ్మణుల యొక్కయు, వారి కుపయోగించు శిల్పశాస్త్రముయొక్కయు పతనస్థితి ఆ మహాసీయుని హృదయమును గరఁగించినది. శిల్ప

గ్రంథాలయాభివృద్ధి కైదువందలరూప్యముల విరాళమునిచ్చి మహాసభవారి కృతజ్ఞత నందుకొనిరి.

తరువాత మునగాల పరగణాధీశ్వరులగు శ్రీరాజా నాయని వేంకటరంగరావు బహద్దరుగారు పూనా, సూరతు, మున్నగు పట్టణములందుండెడి శిల్పశాస్త్రముల సంపాదించు టకు మూఁడువందలరూప్యములు విరాళమునిచ్చిరి. రంగరావు బహద్దరుగారును వీరభద్రాచార్యులుగారును ఒకకళాశాలలోఁ జదివిన విద్యార్థులు. బహద్దరుగారికి శాస్త్రిగారిపై ప్రేమము మెండు. వారి కవితకును, వారి సంఘసేవాకార్యములకును బహద్దరుగారు మిక్కిలి సంతసించుచుండెడివారు. చల్లపల్లి జమీందారులగు శ్రీమంతురాజా యార్లగడ్డ అంకినీడ్ప్రసాద్ బహద్దరుగారును ఈకవినిసన్మానించి, వీరి కుటుంబమునకును ప్రబోధినీపత్రికకును సాయమొనరించిరి. శాస్త్రిగారు రాజుల వద్ద తెచ్చిన ఈధనమును సంఘసేవకొఱకే వినియోగించెడు వారు.

## వృత్తివిద్యలు

పత్రికాప్రచారమువలనను, సభాఉద్యమమమూలము నను విశ్వబ్రాహ్మణుల కులవృత్తులగు అయస్కారాదిపంచ కర్మలను ప్రస్తుతకాలానుసరణముగను, ప్రజోపయోగములు గను అభివృద్ధిచేయవలయుననునది శాస్త్రిగారు తలఁచిన ముఖ్య సంకల్పములలో నొకటికదా. దీనిని మొదటి పత్రికలోనే ప్రస్తా వించి, మొట్టమొదటిసభలోనే దీర్మానము రూపమునకుఁ దెచ్చిరి. విశ్వబ్రాహ్మణులనియు, విశ్వకర్మలనియుఁ బిలువఁబడినను లేకు

న్నను, ప్రతినాగరిక దేశమందును బంచవృత్తులను జేయు ప్రజలు ప్రసిద్ధులైయుందురు. వీరు కర్మశాలలందుత్పత్తి చేయు వస్తుజాలమే ప్రతి దేశముయొక్క ఐశ్వర్యమునకును మూలము. కావున మన దేశముయొక్క ఆర్థికోన్నతియు వీరియొక్క వృత్త్యభివృద్ధిపై నాధారపడియున్నది. ఈరహస్యమును నిరంజనశాస్త్రిగారు వివిధరీతుల వివరించుచు సాంఘికులను హెచ్చరించుచువచ్చిరి. కాని వారిబోధలనుగాని, వారి ఉపన్యాసములనుగాని స్వ సాంఘికులు చక్కఁగ గ్రహించినటులలేదు. అందువలననే శాస్త్రిగారు విశ్వబ్రాహ్మణసంఘమునకును, విశాలతర భారత జాతికిని జేసిన మహోపకారమును సమకాలికులు వినియో గించుకొనలేదని చెప్పవలసివచ్చుచున్నది. ఆ కారణముననే విశ్వబ్రాహ్మణులు అర్థశాస్త్రధర్మములకు వ్యతిరేకముగ నడచు వారై, శాస్త్రిగారిని తమఅజ్ఞానము పెంపునఁ గొంతవఱకు నిరసించువారునైరి. అట్లునిరసించినను సంఘారాధనయే దీక్ష యనుకొన్న శాస్త్రిగారికి వాటిల్లినలోటు కాసంతయు లేదు. ఈనాఁడైనను వారిఉద్యమముయొక్క రహస్యమును మఱొక సారి ప్రకటించుట ప్రయోజనకరమనునాసచే ఆ సిద్ధాంతమును ఇంచుక తడవుచున్నాను.

దేశమున నుత్పత్తియగు వస్తువులు, అనఁగా శిల్పులు సిద్ధముచేయుసామగ్రి ముఖ్యముగా రెండుతరగతులనుండును. (1) సమష్టిని బ్రజోపయోగమునకుఁ దగినవి; (2) కొలఁది మంది భోగములకును లాభములకును ఉపకరించునవి. మొదటి తరగతి వస్తువులు ప్రతిదినము జనులందఱు తమజీవితములందు

వినియోగించుకొనవలసినవిగ నుండునుగాన అవి స్వల్పమూల్య ముగలవిగానుండును. సర్వసామాన్యముగదొరకు దారు లోహాదుల సహాయమున నవి తయారగును. ఇట్టివానిని ఎన్నింటినో విక్రయించినగాని లాభములు సంపాదింప వీలుం డదు. అట్టితటి ఆవస్తుజాలమునునిర్మించువారు పెక్కండ్రు ఆయాకర్మలచే జీవింపనవకాశముండును. భోగసామగ్రిని నిర్మించువారికన్న నిట్టివారికే ఆర్థికస్థితి బాగుగానుండును. భారతజాతి త్యాగశీలమైనది; భోగలాలసము కాదు. కేవల ధనార్జనాసక్తి నంగీకరింపని పారమార్థికాదర్శముకలది హిందూజాతి. అయినను నేటి పరిస్థితులందు పాశ్చాత్యుల సంసర్గమున మెలగుచు వారిపాలనమున జిక్కుటచే వారి ఆర్థికసంప్రదాయము ననుకరించుచు వారి వ్యామోహము లోనే పడిపోయినది. ఆపాశ్చాత్యులో, పారమార్థిక విషయ ములను సామాన్యసమష్టి జీవితమున దూరముగనుంతురు. భోగానుభవమున నుదాసీనతజూపకుండుటేగాక, అయ్యదియే జీవితలక్ష్యమందురు. దారిద్ర్యమును దోషముగను, ధనసంప దను సజ్జనలక్షణముగను భావింతురు. ఇట్టివారి ఆర్థిక పారి శ్రామిక పరిస్థితులు మనదేశమును భ్రాంతిపఱచి వృత్తులను దాఱుమాఱు జేసినవి.

మనవారును దేశాభిమానమునుపేక్షించి, విదేశవస్తు వులనే కొననారంభించి, దేశీయశిల్పుల కుత్సాహమీయక పాశ్చాత్యవస్తువుల ప్రేమించుటచే వృత్తులు మొదలంట నాశ నమైనవనియే చెప్పవచ్చును. మఱల వానిని బునరుద్ధరించుటకే

శాస్త్రిగారివంటి మేధావులు పలు తెఱంగులం బ్రబోధించుచు వచ్చిరి. వివిధపరిశ్రమలను, శిల్పములను వృద్ధిచేయవలయు నని చాటిరి. దేశాభిమానము ఇనుమడింపవలయునని యుగ్గ డించిరి. కేవలము స్వర్ణవృత్తినే ఆశ్రయింపక ఇతరములగు సర్వజనోపయోగకరములగు పరిశ్రమముల నెలకొల్పుమనిరి.

యూరపు అమెరికాదేశపు వస్తువులు మనదేశమునకు రా నారంభించిననాఁడు, కొద్దిధరలకే సరకులు దొరకినవి. వానితో వ్యాపారముచేసి దేశీయవర్తకులు ఘనులైరి. శిల్ప సంఘము విశ్రాంతినిబడసినది. మందమారుతములు ప్రళయ వాతములుగఁ బరిఢవిల్లి సర్వమును నాశముసేయ సమకట్టినవి. విదేశవస్తుజాలము వీధులలో నిండిన కొలందిని అట్టివానిని దేశ మున నిర్మాణముచేయుచుండిన శిల్పుల జీవనము శిథిలీభూత మైనది. వర్తకులు స్వయముగ వస్తుసృష్టిచేయించుటమాని, వెదకివెదకి విదేశపుసరకులఁదెప్పించి అమ్ముచు, విదేశపు సాహు కారుల అనుచరజీవులైరి. ఏకొందఱో కోటీశ్వరులైరన్నను, వారును బరజనపోషణమునఁ బ్రతుకువారేగదా! ఇంకఁ దక్కినవారో తేజము గోల్పోయినవారే? ఇటుల స్వదేశ పరిశ్రమలు మూలఁబడఁగాఁ దత్కర్తలగు శిల్పులును, ఆయా పరిశ్రమల కుపకరించు పారిశ్రామిక జనమును అష్టకష్టములపాలై ఆ విదేశపుభోగసామగ్రిమాట యటుండ అనుదినజీవనావసరములగు సామాన్యవస్తువులనైనను విక్ర యించుకొనలేక శుష్కించిపోయిరి.

ఇంకను శిల్పివతంసులగు ఈవిశ్వబ్రాహ్మణులస్థితి ఎట్లు న్నదో చూడుడు. నిపుణత లేనివారా? బుద్ధికుశలత కొఱ వడినవారా ? ఆత్మగౌరవశూన్యులా ? సోమరులై ప్రాలు మాలువారా? కారు కారు. కాలగతికిలోనై అట్లు పొడగట్టు చున్నారు. కొండఱాలనుండి లోహసముదాయమును ఏర్చి తీసి చిత్రవిచిత్రవస్తునిర్మాణముఁజేసిన ధీమంతులుకారా ? అడవుల నఱికి దారువులఁదెచ్చి మహాసౌధముల నిర్మించినవారు కారా ? మూఁగఱాలఁజెక్కి ప్రతిమానిర్మాణముచేసి జీవము పోసి అఖిలజనాళిచేఁ బూజింపఁజేసినవారు కారా ? ఇప్పటి గొప్పయాత్రరాజములైనను గదలింపఁజాలని శిలలను తాళ్ళ మెత్తునకునెత్తి గోపురాగ్రముల నిలిపినవారు కారా ? అయిన నేమి ? నేఁటికాలమున వారి ప్రతిభామహత్త్వములు బయల్పడు నవకాశములు లేకున్నవి. సహజముగనే బుద్ధికుశలురును, నవ్యకల్పనానిపుణులును అగువారే యెడనైన జడప్రాయులై పడియుండఁగలరా ? వారిశక్తిసామర్థ్యములు స్తబ్ధములై అణఁగి యుండగలవా ? అయ్యవి పురోగమనమునైనను సాగింప వలయును. లేదా తిరోగమనమునైనఁ జేయవలయును. ఎట్టె టులో బెనఁగులాడి తమప్రభావమును బ్రకటింపకతీరదు. దైవసంఘటనవలనఁ బూజనీయములగు పంచవృత్తులు విదేశీయులదాడికిఁ దాళఁజాలక స్వదేశస్థుల అభిమానమునకు దూరములై వెనుకబడినను, ఈశిల్పిసంఘములు ఉన్నతికి రాక తప్పదు. పరస్పరద్వేషము, నిరభిమానత, ఐకమత్యములేమి, అనుదొసఁగులు అంతరింపక తీరదు. ఎట్లు?

## సంఘీకరణము

దీనిని సంస్కరించునది శాస్త్రిగారు సంతతము ఉపదేశించుచుండిన మంత్రమే. అదియే సంఘీభావము. ద్వేషము అనైకమత్యము, కలహములు తమోగుణలక్షణములు. ఇవి క్రూరమృగములందును, ఘాతుకజంతుసంతానములందును గోచరించును. వీనిని బోనాడినంగాని సంఘీభావము పెంపొందదు. జగత్తునందు సత్వరజస్తమోగుణములు మూండింటితో విడివడిన వస్తువొక్కటియుం గానము. ఇందు సత్వగుణము ప్రేమమును బురికొల్పును. సంఘీభావమును గూర్చును. సమన్వయదృష్టి నొసంగును. ఐకమత్యమును వృద్ధిపొందించును. మనలోం గొంచెముగనైనను ఉన్న ఈసత్వగుణమునాశ్రయించి, దాని నారాధించి ధ్యానించినచోం బ్రేమోదయమగును. స్నేహభావము అంకురించును. ఖండనవాదములు వెనుకకుందగ్గును. సంఘాభిమానము పెరుగును. ఇది కార్యరూపముదాల్చినపుడు మానుషత్వము వికసించును. మనలోని రజోగుణమును బ్రేరేచి సత్యసంకల్పమునకుం దోడుచేసి దీనినాచరణములోం బెట్టి పక్వదశను సాధించునపుడు మనము ఋషిసంతానములమని చెప్పుకొనంగల్గుదుము. ఈ పైతృకైశ్వర్యవలన మహోన్నతిని బడసిన మహనీయులే ఋషులు. వారే సర్వమానవులలోం బూజ్యులు. విశ్వబ్రాహ్మణులను ముఖ్యముగా ఈదశకుందెచ్చుటకే శాస్త్రిగారు గ్రామసమాజములను బెట్టించియు, మహాజనసభలను నడపించియు, విద్యానిధులను సృష్టించియు, వేదపాఠశాలలను బ్రోత్సహించియు, ప్రవాసికోపన్యాసముల నొసం

గియు, అన్నింటికి మూలాధారముగఁ బ్రబోధినీ పత్రికను నెల కొల్పియు బహుభంగులఁ బాటుపడియున్నారు. వీరి పవిత్ర జీవితమహిమ నేఁడుగాకున్నను, స్వసాంఘికులచేతఁగాకున్నను భవిష్యత్కాలముననైనను, సంఘచరిత్రల రచించు విద్వద్వ్రే ణ్యుల చేతనైనను మెప్పువడయక తప్పదు.

శాస్త్రిగారి ఆశయము ఇంతమాత్రమే కాదు. వీరు తమసంఘమును బూర్ణసత్వగుణోపేతముగావింపఁ బ్రయత్న ములు చేసియున్నారు. మతబోధలఁ గావించియున్నారు. వేద రహస్యములఁ బ్రచారముచేసియున్నారు. వేదాంతతత్వమును బ్రబోధించియున్నారు. మానవోత్తములుపడయు ఋషిత్వము నతిక్రమించి పురుషోత్తముని ప్రభావమును అపరోక్షానుభూతి సేయఁగలదశకు సాంఘికుల నుద్ధరింపఁ బ్రయత్నించియున్నారు.

సోదరులారా! ఏవిధమగు పాక్షికాభిమానసురభిమాన ములను దటిరానీక శాస్త్రిగారి దివ్యబోధల సారమును విచారిం చుచో, వారు విశ్వబ్రాహ్మణకులమున జననమై,విశ్వబ్రాహ్మణు లను స్వజనులని ప్రేమించి, మహాత్యాగమును గావించి చేసిన మహోపకారము సులభముగా గ్రాహ్యమగును.

ఇంకొక విశేషము. ఈయంశములు శాస్త్రిగారి సాంసా రికజీవనమునను, ఆర్థికవిజయమునను, కీర్త్యుపార్జనమును సుప్ర త్యక్షము కాలేదేమని శంకింపవచ్చును. మొక్క క్రమముగాఁ బెరుగుచుఁ బెద్దదై పూవుపూచి కాయగాచి, పండ్లురాల్చువఱ కును, దానిపరిణామదశలు దృగ్గోచరములగును. కాని సిద్ధావస్థ యగు బీజరూపమును దాల్చినపుడు దానిప్రభావ మిసుమం

తయుఁ దగ్గకున్నను, మఱియు సుపరిణతమైమెప్పినను పైకి హీనముగను స్వల్పముగను గాన్పించును. ఆవిధముననే శాస్త్రి గారు యువావస్థయందు వివిధవిద్యాప్రభావములఁ బ్రకటించుచు సభాస్థలములందు గౌరవములఁ జూఱగొనుచుఁ, బైనిచెప్పిన మహాసత్కార్యములఁ జరిపిననాఁటియుదంతములను, మఱియు వారిబోధలను జీర్ణముచేసుకొని, వానిని హృదయమునఁదాల్చి వానినేయనుకరించుచు ఇతరులు సభలను గావించునట్టియు, సంఘముల నెలకొల్పునట్టియు, గ్రంథముల రచించునట్టియు దశాంతరములందు శాస్త్రిగారిప్రభావము బీజాంకురన్యాయ మునఁ దదితరుల చెదములందు రూపాంతరమందిన దనవలయును. దానిని గుఱుతించియే శాస్త్రిగారు వార్ధక్యమునఁ గొంతవఱ కౌదాసీన్యమును వహించినటుల గాన్పించి యువకులఁ బ్రోత్స హించి వారి ద్వారమునఁ గార్యముల నడపింపసాగిరి. ఈవిధ మున శాస్త్రిగారి జీవితకల్పలత ధన్యమై వెలసినది. "జాతీయసేవన కళాపరిపూతమూర్తి" కాఁగలిగినాఁడు నిరంజనార్యుఁడు.

---

# అధ్యాయము ४

## సంస్కరణోద్యమము—కన్యావరశుల్కములు

శాస్త్రిగారిది సంస్కరణపూర్ణ హృదయమని మున్నే చెప్పియుంటిని. హిందూసంఘములో వేరుపురుగులవంటి దోషములుకొన్ని పాదుకొనియున్నవి. అతిబాల్యవివాహములు, కన్యాశుల్క వరశుల్కములు మున్నగునవి సంఘముయొక్క సర్వతోముఖాభివృద్ధికి ఆటంకములై యున్నవి. శాస్త్రిగారికి ఇట్టిదొసఁగులు సంఘములోనుంట బొత్తుగా గిట్టదు. వీరు సభల నారంభించిన దినములలోఁ బ్రబోధినియం దీవిధమునఁ దన సంస్కారాభిలాషను వెలిబుచ్చియున్నారు.

సీ. కన్న కూఁతుల నెల్లఁ • గ్రయవీథిఁ బెట్టెడు
కడు హేయవృత్తిని • గాల్పవలదె,
అంద్రకై మగవార • లమ్ముడువోవు నీ
ఘోర దుర్ణయమెల్లఁ • గూల్పవలదె,
పసికూనలకుఁ బెండ్లి • బాగు బాగని సంత
సించువారల నిర • సించవలదె,
ఆఁడువారికి విద్యయా • యని మూల్గెడి
పటు దురాచారంబు • బాపవలదె

గీ. అన్యులకుఁబోలె మనకు దుఃఖాగతంబు
లెన్నియో కలవన్నియు • మన్నుచేసి,
సంఘవృద్ధికి యోచనఁజక్కఁజేసి
మాటలాడఁగరండు సుస్వామ్యులార!

నిరంజన శాస్త్రిగారు. ప్రబోధిని సంపు ౨. సంచిక 3

పైపద్యమునుబట్టి కన్యావరశుల్కములన్న శాస్త్రి గారికి ఎంత యేవగింపో ప్రకటము కాకపోదు. యథార్థమా లోచించిన నిది దూష్యము కాకపోదు. కడుపార గని పెంచిన అల్లారు ముద్దుపాపలను బొట్టనింపుకొనుటకు రొక్కమునకుఁ దెగసమ్ముట ఘోరాతిఘోరము. గృహస్థాశ్రమస్వీకారము యొక్క అభిప్రాయములలో సత్సంతానమును గనుటకూడ గేస్తుయొక్క ఒక పరమధర్మము. గృహస్థుఁడు తన సంతానముయొక్క అభివృద్ధికొఱకై శారీరక మానసిక ఆధ్యాత్మిక శక్తులయొక్క వికాసమునకై తన ధనప్రాణములను, బుద్ధిని వినియోగించవలయునేగాని ముక్కుపచ్చలారని యా చిఱుతపాపల మూలమున డబ్బుగడించి తన పొట్టనింపుకొనఁగూడదు. బాలికలకు వలసినంత లోకజ్ఞానము కలుగువఱకు జాగరూకతతో సాఁకి, యుక్తకాలమున సల్లక్షణోపేతుఁడగు వరునకు విధియుతముగా దానము చేయవలయును. అట్లు పితృధర్మమును లక్ష్యమునందుంచుకొని చేసిన కన్యాదానమే *బ్రాహ్మము

---

* (1) జ్ఞానశీలుఁడగు వరున కాతఁ డడుగకుండనే వస్త్రాభరణాలంకృతమైన కన్యను దానముచేయుట బ్రాహ్మము. (2) యజ్ఞములో ఋత్విక్కున కలంకృత కన్యను దానముచేయుట దైవము. (3) ఒకటి, లేక రెండు గోమిథునములను శుల్కముగాఁ గాక యజ్ఞముకొఱకై అల్లునినుండి తీసికొని, శాస్త్రప్రకారము కన్యాదానముచేయుట ఆర్షము. (4) వధూవరులనిద్దఱను ధర్మము చరించుఁడని చెప్పి చేసెడు కన్యాదానము ప్రాజాపత్యము. (5) కన్యయొక్క జ్ఞాతులకును, కన్యకును ధనమునిచ్చి స్వేచ్ఛగాఁ జేయఁబడు కన్యాస్వీకరణము ఆసురము. (6) వధూవరుల అంగీకారముచేతనే చేయంబడు కరగ్రహణము గాంధర్వము. (7) తగవులాడియుఁ గొట్టియుఁ గోపించియు అఱచుచున్నట్టి ఏడ్చుచున్నట్టి కన్యను హరించుట రాక్షసము.

మున్నగు యోగ్యతర వివాహములలో లెక్కింపఁబడును. అట్టి వివాహమే జననీజనకులకును, వధూవరులకును సత్ఫలములఁ బ్రసాదించును.

ఈవిధముగా సాలంకృతకన్యను దానము చేయలేకున్నను యథాశక్తి స్వగృహమున వివాహవిధిని జరిపి శుభాశీస్సులతోఁ గూఁతు నత్తవారింటికనిపి కృతార్థుఁడు కావచ్చును. అంతకును శక్తిలేనివారున్న, అల్లునినుండి ధనము గైకొనక యాతని విత్తముతోడనే పెండిలిచేసుకొనుమన లేర్పఱచుకొనవచ్చును. కాని యియ్యది చాల అవరధర్మము. ఇందైనను ఏకాంచెముగాని కన్యాజనకుల ద్రవ్యము వినియోగపడవలయును. వ్యవహారవశమునఁ గొలఁదిగాఁ గన్యాదానవిధిని ముచ్చటించితిమిగాని విస్తరము వేఱు పుస్తకములందుఁ గాననగు.

కన్యాశుల్కము ఎట్లు నిషిద్ధమో, అట్లే వరశుల్కమును నింద్యము. కన్యాజనకులు ఆశీర్వాదపూర్వకముగా వధూవరుల మంగళమునుగోరుచు ఏయేవస్తువాహనములను, లేదా విత్తమును నిత్తురో అయ్యవియే పరిగ్రాహ్యములుగాని వారిని గష్టపెట్టి నిర్బంధముమీఁదఁ గైకొనఁబడు ధనముగాని, మఱేదిగాని శ్లాఘనీయముగాదు. నేఁటికాలమున గట్నములు బుచ్చుకొనుట విపరీతముగాఁ బ్రబలిపోయినది. కొందఱు ఈ కట్నములకొఱకే దమ సుతులను ఏ రెండుమూఁడు తరగతుల వఱకో జదివించుచు నదినెపముగా మాకుఱ్ఱని కేమి కట్నము

(8) నిద్రించునట్టియు మత్తురాలైనట్టియు రహస్యముగ నెచటికేని ఏగుచున్నట్టియు కన్య నెత్తుకొనిపోవుట పైశాచము.

లిత్తురని వధూజనకులను బీడించుట, విద్యాప్రియులగు ఆడు పిల్లల తలిదండ్రులు ఎట్టకేలకుఁ దమతలదన్ను శుల్కములను ఇల్లువాకిళుల నమ్మియైనను నీయనిచ్చగించుట, అందుచే వారు పలుకష్టములనందుట, మన మెన్నిచోట్లనో గనుచున్నాము. విద్యాబుద్ధులుగలిగి యోగ్యుఁడగు నల్లుఁడుగావలయునని వెదకు మామలు ఏ, బి. ఏ. వానినో గోరి శక్తికిమించిన శుల్కము లతో వానింగొని, పెండ్లియైనదాది వారాయల్లునికి ఎత్తులు పెట్టఁజాలక తమ కన్యాపితృత్వమును దూషించుకొనుచున్నారు.

ఒక్కొకవ్యక్తి అత్తవారు సరిగాఁ గట్నముల నీయ లేదనియు, అర్థరహితములును ఆడంబరసహితములును అగు తన గొంతెమ్మకోరికలను బూరింపలేదనియుఁ బేర్మిమెయిఁ బెండ్లా డినయిల్లాలిని ఎన్నికష్టములపాలు సేయుచున్నాఁడో మన మెఱుఁగుదుము. అంతియేగాక పూజ్యులగునత్తమామలనుగూడ నేలకుంగోలకుఁ దెచ్చుచున్నాఁడు గదా! దీనికంతకుఁగారణము అన్యాయముగను, అధర్మముగను దాను గామించు శుల్కమే గదా కతము. ధర్మశాస్త్రములందును బూర్వులయాచారము లందును, దలిదండ్రులు శక్తివంచనలేకుండఁ గూఁతుని యల్లుని యథార్హవస్తువులచే సమ్మానించి పంపవలయుననియే గన్పట్టు చున్నదిగాని, మితిమీఱిన వారికోర్కెలను ఆత్మనాశనము గావించుకొనియైనను నిండించుమని లేదే! కెంకెయల్లునిచేఁగల్గిన కష్టములకు గుఱియైనవాఁడు గాఁబోలు నీకవి—

"జామాతా దశమో గ్రహః"

అల్లుఁడు పదియవగ్రహమని నుడివినాఁడు. ఇదియెంతయు సత్యము.

పవిత్రమైన హిందూజాతికిఁ గన్యావరశుల్కములు సహింపరాని దురాచారములైయున్నవి. ఈ దురాచారములు దూరీకరింపఁబడినఁగాని భావిసంతానముయొక్క గృహస్థధర్మము చక్కఁబడదు. అపుడుగాని గృహస్థుయొక్క సౌఖ్యానందశాంతులు వెలుఁగొందఁజాలవు. నాఁడే గృహము శచీదేవేంద్రులతోఁ దేజరిల్లు స్వర్గధామమై యలరారును.

నింద్యములగు కన్యావరశుల్కములను గూఁకటివ్రేళ్లతో మట్టుపెట్ట మన సంస్కర్త్రవతంసము కంకణముకట్టుకొని అనేకసభలలోఁ బ్రబోధములుచేసి తీర్మానములుపెట్టించి, ఆచరణరూపమున సంఘమునకు ఎనలేనిసేవ చేసియున్నాఁడు. శాస్త్రిగారి మేలితలఁపును గుర్తెఱిఁగి, హిందూమతౌన్నత్యమును బలుమార్లు స్మరించి, గృహస్థలోకముయొక్క పరమావధిని గమనించి, భావియువకులీకన్యావరశుల్కములబారిఁ బడకుందురుగాత.

### బాల్యవివాహములు

ఈసంస్కర్తకు గిట్టని వేఱొకవిషయము అతిబాల్యవివాహములు. కావుననే "పసికూనలకుఁ బెండ్లి బాగుబాగని సంతసించువారల నిరసించవలదా" అని తన సంస్కారాభిలాషను ముక్తకంఠముతో వెలిబుచ్చినాఁడు. బాల్యవివాహముల వలన అనేకానర్థములున్నవని యిప్పుడిప్పుడందఱును గ్రహించుచున్నారు. కనులు తెరవని పసికూనలకుఁ దామేవో పున్నెముల నందవలెనను కోరికతోఁ బెండ్లిసేయుట ఆచిఱుతకుఁ, బెండ్లియననేమో పెండ్లిముచ్చట నెట్లు తానందవలెనో ఎఱుఁగని

స్థితిలో అవ్వగారిముచ్చటకో, తాతగారివినోదమునకో వివాహము చేసి సంతసించుట యోగ్యముకాదు. ఈ విషయమున ధర్మశాస్త్రములు భిన్నమార్గముల నవలంబించియున్నవి. అష్టవర్షప్రాయముననే వివాహము యుక్తమని కొన్నిశాస్త్రములును, రజస్వలానంతరమైనను వివాహము సేయవచ్చునని కొన్నిశాస్త్రములు వక్కాణించుచున్నవి. ఈ విషయమున శాస్త్రముల నాధారముచేసికొని యింకను వివదించుచునేయున్నారు. ఎన్ని శాస్త్రము లెట్లెట్లు పలుకుచున్నను బాలబాలికలకుఁ బ్రపంచ జ్ఞానము కలిగినపిమ్మటనే వివాహముసేయుట యుక్తము. కావుననే ఈ ధర్మశాస్త్రకోవిదుఁడు శాస్త్రములయందలి పరస్పరభేదమును గూలంకషముగా విచారించి, ఆచారమును శ్రేయస్సును దృష్టిపథమున నిడికొని పది పదిరెండువర్షముల ప్రాయమున ఆఁడుబిడ్డలకు వివాహముసేత యుచితమని దీర్మానించినాఁడు. ఈ విషయమునఁ గృష్ణా గుంటూరుమండల విశ్వబ్రాహ్మణ సభలలో శాస్త్రవాదములు సలిపి తీర్మానములుపెట్టించి నెగ్గించియున్నాఁడు.

ప్రస్తుతము ఆచరణములోనున్న శారదాచట్టము పదునాలుగువత్సరములు దాఁటవలెనని శాసింపఁ దాను పండితుఁడయ్యు ఎనిమిదేండ్లపిల్లకు వివాహము శాస్త్రీయమనిపల్కు సాటివిద్వాంసుల వాదమునకును, రజస్వలానంతరము ఏ పదునాఱేండ్లకో పెండ్లిసేయవలయునను ఆధునికుల వాదమునకును ఒకసంధిని గుదుర్చుచు సర్వవిధముల నాలోచించి పదిరెండు సంవత్సరములని నిర్ణయించుట సమంజసముగానున్నది.

ముకుపచ్చలారని పాపలకుఁ బెండ్లి సేయుటకంటెను, రజస్వలయైనపిమ్మటఁ బ్రౌఢపాకమునఁజేయు పెండ్లికంటెను ఇయ్యది మధ్యవయస్సున యుక్తతరముగానుండునని శాస్త్రి గారు తలంచిరి. తనతలఁపును ధైర్యమువహించి సిద్ధాంతరూప మున నాచరణములోనికిఁ దెచ్చుటకుఁ దీర్మానములుచేసి కృత కృత్యులైరి.

## స్త్రీవిద్య

పండితమ్మన్యులగు కొందఱు ముకుపచ్చలారని బాలి కలకు వివాహముసేయుటకెట్లు ముందంజవేసెడివారో స్త్రీ విద్యానిషేధమునకును నట్లే కాలుదువ్వుచుండువారు. ఆఁడు వారికి వంటయిల్లే పాఠశాలయనియు వివిధములగు కూరలు పిండివంటలు సేయుటే గ్రంథపఠనమనియు, నట్టిపదార్థములతోఁ దమవారి పొట్టనింపుటే జ్ఞానోపార్జనమనియుఁ గావున స్త్రీలకు విద్య యవసరములేదని తృప్తిచెందుచుండెడివారు. అదియునుం గాక ఆఁడువారు చదువుకొన్నచో ననేకానర్థము లుత్పత్తిల్లు ననియుఁ బైవారి మతము. ఇట్టి దూరదృష్టిలేని సంకుచితభావ ములతో గృహిణీలోకమును విద్యాగంధములేని అలంకారభరిత ములగు మోదుగుపూలనుగాఁ దయారుచేసియున్నారు.

విద్య యనేకప్రయోజనముల కాకరమని యెల్లరంగీకరిం తురుగదా! మానవుఁడీ ప్రపంచమున ఎట్లు నడచుకొనవలయునో, ఏమార్గమునవలంబించిన మనుష్యునిజీవితము భద్రమైయొప్పునో, మానవజీవితముయొక్క పరమలక్ష్యమేమో, తల్లక్ష్యమును మానవుఁడెట్లు ప్రాపించవలయునో, ఇతమేల? ద్వంద్వయుక్త

మగు లోకమునకును దనకును ఎట్టిసంబంధముకలదో, తానేల ఈ పుడమినిజనించెనో ఎఱుంగవలెనన్న విద్యకన్న నొండెద్ది సాధనము ?

జీవితనిర్వాహణమున కెఱుంగవలసిన విధులన్నియు స్త్రీ పురుషభేదములేక యెల్లర కావశ్యకములుగదా ! అట్టితఱి స్త్రీలకుఁ బ్రత్యేకముగా విద్య వలదనిచెప్పుట పరమ మౌఢ్యము. గృహనిర్వాహణమునసైతము స్త్రీలకెంతయో బాధ్యత కలదు. గృహిణీరత్నము తనమగనియెడ నెట్లు వర్తింప వలయునో, అత్తమామలవిషయమున ఎట్టి పూజ్యభావముఁ జూపవలయునో, బంధుగులయెడ నతిథులయెడ నేవిధముగ మెలఁగవలయునో దెలిసికొనవలసియున్నది. మఱియు గృహస్థాశ్రమ ఫలములును, సతీపతుల స్నేహసారమువలనఁ గలిగిన ఆనందఖనులనఁదగు ముద్దుబిడ్డలను గనుటయు, వారినిఁ దగురీతిఁ బెంచుటయు స్త్రీపురుషుల కర్తవ్యము. అట్టి కర్తవ్యమును నిర్వహించుటలోఁ బురుషునికంటెను మాతృదేవియే మిక్కిలి బాధ్యురాలైయున్నది. బాల్యమునుండియుఁ దల్లి బిడ్డలకు ఎట్టి యభిరుచులను గల్పించి ఏయే మార్గముల నవలంబించి వారిని బెంపొందించునో అట్టి ఫలములమీఁదనే యా నిసుంగుల భావిజీవిత మాధారపడియుండును. కావున సత్సంతానమును గనుటకును, వారిని జ్ఞానఖనులనుగాఁ జేసి కృతార్థత నందుటకును మాతృదేవికిఁగల బాధ్యత దొడ్డది. అందుచేతనే దల్లికి ఉన్నతస్థానమును మనువునంతటి ధర్మశాస్త్రవేత్త యిచ్చుటకుఁ గారణమైనది.

"ఉపాధ్యాయాన్ దశాచార్యః ఆచార్యాణాం శతం పితా,
సహస్రం తు పితౄన్ మాతా గౌరవేణాతిరిచ్యతే"

ఒక ఆచార్యుఁడు పదిమందియుపాధ్యాయులపెట్టు. అట్టి నూరుగురు ఆచార్యుల విలువగలవాఁడు తండ్రి. అట్టితండ్రుల సహస్రముకంటెను మాతృదేవి పూజ్యురాలు.

ఈశ్లోకమునుబట్టి మాతృకర్తవ్యమెంత గొప్పదో తెలియుచున్నది. ఈవిధమైన తనకర్తవ్యమును గృహలక్ష్మి నిర్వహించుటకామె కెంత విద్యాజ్ఞాన మవసరమైనదియు సులభముగనే గోచరింపకపోదు.

తాను సకలశాస్త్రపండితుఁడయి, తనగృహిణి అజ్ఞానపుఁ బ్రతిమగానుండుట కేపురుషుఁడైనను ఒప్పుకొనునా? అట్టి యామెతోఁ జేయుకాఁపురము దుఃఖభాజనమగునేకాని, ఆనందయుతము కానేరదు. కావున స్త్రీలకు విద్యయొక్క ఆవశ్యకత ఎంతయేనిఁగలదు.

ప్రస్తుతకాలపు హిందూదేశ విద్యావిధానము పురుషులకే సరియగురీతిని లేదని మననాయకులనుచున్నారు. అట్టితఱి స్త్రీలమాట చెప్పెడిదేమి? స్త్రీవిద్యావిధానము సంపూర్ణముగ మాఱవలయును. స్త్రీజీవితనిర్వాహణమునకు ఏయే విద్యలభ్యసించవలయునో అవి తగినకాలములోఁ బూర్తియగుపద్ధతులతోఁ బ్రత్యేకపాఠశాలలలో నేర్పఁబడవలయును. ఉన్నతవిద్యలు కావలయుననుకొన్నవారికి అట్టివానినభ్యసించు నవకాశములు కూడ నుండవలయును. స్త్రీలకుఁ బ్రత్యేకపాఠశాలలును, గళాశాలలు నుండవలయునేగాని పురుషులతోఁబాటు వారును గలసి

మెలసి చదువుట మన హైందవనీతికిఁ దగదని నాయభిమతము. ప్రత్యేకస్త్రీజనపాఠశాలలలో సవ్యవిద్యావిధానము నేర్పఱచి చదువులు సాగించినఁగాని నారీలోక మభ్యుదయమునంది భారతదేశోన్నతికిఁ గారణముకాదు. స్త్రీవిద్యయందు నాకుఁ గల సహజాభిమానము ప్రస్తుతాప్రస్తుతములను సంయితము మఱపించి ఈవిస్తరమునకుఁ బురికొల్పినది. పాఠకులు సహింతురుగాక!

శాస్త్రిగారు వెనుకటిపండితుల తరగతిలోనికిఁ జేరినవారయ్యు స్త్రీవిద్య నింతగాఁ బ్రేమించి ప్రబోధించుట మనము కలలోనైన మఱువరాని విషయము. ఏ సిద్ధాంతకౌముదీ సూత్రములనో నోటవియునట్లు వల్లించి పండితుఁడననిపించుకొనుట వారిలక్ష్యమునకు దూరమైనపని. పండితుఁ డన సర్వ విషయముల నెఱింగి యాచరించి యాచరింపఁజేయుట, లోక శ్రేయములగు సంస్కారమార్గము లనూహించి బహుజనుల మేలునకై పాటుబడుట, సారస్వతముగఁగాని సాంఘికముగఁ గాని, జాతీయముగఁగాని, నిష్కామమగు సేవయొనర్చుట మున్నగునియమములు కలవాఁడేయని వారియభిప్రాయమై నట్లెన్నిమారులో నాతో నుడివియున్నారు. తన జీవితమును సైతము అట్టిదిగనే జేసికొనఁగల్గిన సదాచారి నిరంజనమనీషి.

## బాల్యశాసనము

వృత్తివిద్యలకు సారస్వతవిద్యల తోడ్పాటుండవలయునని శాస్త్రిగారు మొదటనుండియుఁ బ్రబోధించుచున్నారు. ఈ విషయమును ప్రబోధినిలో బాల్యశాసనమను పేర వివరించి

యున్నారు. చిన్నప్పటినుండియే బాలకులను గర్మశాలలలోఁ బ్రవేశపెట్టరాదనియు, వారికి వలసినంత విద్యాజ్ఞానమును శిల్ప శాస్త్రాదిపరిజ్ఞానమును గలిగించిన పిమ్మటనే కర్మవిద్యల నభ్యసింపఁజేసిన వానియందు నిపుణులై ప్రవర్తిల్లఁగలరనియు వారి యాశయమైనట్లు దిగువవాక్యములనుబట్టి తెలియఁగలదు.

"బాలకులకు యావనాంకురములు మొలచునప్పటికి దుస్తంత్రములందు నిరాఘాటముగాఁ బ్రవేశించుటకు విజ్ఞాన విద్యాబోధ లేకపోవుటయే గారణమౌచున్నది. అట్టికారణములుగూడ దోఁచినంత వివరించుచున్నాను. ఇతరవృత్తులన్నిటికంటె నత్యల్పఫలమిచ్చునవియైనను, తాత్కాలికఫలమిచ్చునవి విశ్వబ్రాహ్మణులొనర్చు పనులనియే చెప్పవచ్చును. అట్టిఫలమప్పుడనుభవించుటకు దగినదిగనుకనే తాత్కాలిక స్వల్పఫలాభిలాషులై, వివేకవిద్యాదులు బోధించుటమాని, ముఖ్యవృత్తియే యిదియని నమ్మి, బొడ్డూడని పసికూనలైనను పనులలోఁ ద్రోయుచున్నారు. ఇట్లనుట వృత్తులయందు నిందారోపణసేయుట కాదు. వృత్తులు బ్రహ్మవృత్తులేయగును. వృత్తుల నిందించువారు తమయజ్ఞానవృత్తఫలముల నితరులకు బంచిపెట్టినవారగుదురు. బ్రహ్మవృత్తులనుటకు దగినంత దృష్టాంతములు ముందు జూపుచున్నాను. బాలకులకుఁ బనులు నేర్పుటకుముందు తగినంత జ్ఞానముబోధించినగాని చక్కనిపనులు పట్టుపడవని నాయభిప్రాయము. సమస్తవస్తుతత్వజ్ఞానమునందు బుద్ధిని బదిలపఱచి, తదుపరి కర్మవిద్యలయందు బుద్ధినిజొనిపిరేని పదునువెట్టిన చూరకత్తివలె ప్రతిపనిని నిరాఘాటముగా చేయనోపుదురు. విశ్వ

బ్రాహ్మణులనువారి పూర్వఋషులాజ్ఞాపించినదియొకవిధముగను వారు ప్రవర్తించునది యొకవిధముగను నున్నయది. మయమత శిల్పాగమమునందు ప్రథమాధ్యాయము అఱువదియైదవశ్లోకము మొదలైదు శ్లోకములలో "విశ్వకర్మ కులజుడగు బ్రాహ్మణుండు వేదము, ధర్మశాస్త్రము, సాముద్రికము, జ్యోతిశ్శాస్త్రము, గణితశాస్త్రము, లోహకాష్ఠ పాషాణాది సమస్త వస్తు శాస్త్రములు, శిల్పశాస్త్రము, వాస్తుశాస్త్రము, యంత్ర మంత్రశాస్త్రములు మున్నగునవియు సమస్తశిల్పములు ఉప నయనాదిగ పదిరెండువత్సరములు గురువులవద్ద నేర్వవలెను. తదుపరి వివాహితుడై సృష్టి సేయుటకు దొరకొనవలెను" అని చెప్పబడియున్నది. ఇట్లు ప్రతిశిల్పాగమమునందును, శిల్ప విద్యాభ్యాసమునకు ముందు శిల్పశాస్త్రాభ్యాసము చేయవలె నని చెప్పబడియున్నది. "

శిల్పశాస్త్రపరిజ్ఞానము, వివిధవస్తుతత్వవిజ్ఞానము లేక పనులొనరించువాఁడు కర్మకారుఁడగునే కాని, శిల్పియనియు శిల్పాచార్యుఁడనియుఁ జెప్పఁబడఁజాలఁడు. కావుననే పైయాగమ గ్రంథము సమగ్రధర్మమును నిరూపించియున్నది. శాస్త్రిగారీ కర్తవ్యమును బలురీతులఁ బ్రబోధించియున్నారు.

సంఘమును ఉద్ధరింపఁజాలు నిట్టిసంస్కారముల నెన్నిం టినో చేసి కృతార్థులైరి. సాధారణముగ సంస్కర్తలగువారు ఏ విశాలవలయమునో సంస్కరించి, దానిచేలభించు కీర్తి ప్రతిష్ఠల నందుచుందురు. శాస్త్రిగారిపద్ధతి యట్టిదికాదు. స్వల్పసంఖ్యాపరిమితమగు విశ్వబ్రాహ్మణసంఘమునే సంస్క-

రింపఁబూనుకొని విశాలోద్యమములలోఁ బాల్గొనుటచే లభించుకీర్తిని ద్యాగము చేసిరి. ఇదియే శాస్త్రిగారి సంస్కరణోద్యమములోని విశిష్టత. తాను స్వల్పవలయమునఁ బ్రారంభించినసత్కార్యమొరులకాదర్శమై యొప్పవలయుననియు వారి తలఁపుగాఁ బొడకట్టెడిని. ఇదిమిక్కిలియుఁ బ్రశంసనీయము.

---

## అధ్యాయము ౫

### న్యాయస్థాన విజయము

వైదికాచారపరాయణులై వివిధములగు శిల్పవృత్తులం జేయుచుండు సానగాదిపంచర్షి సంభూత బ్రాహ్మణులకును, కేవలవైదికవృత్తితోం గాలముపుచ్చు నితరబ్రాహ్మణ్యమునకును మున్నొకసారి వాదములుచెలరేంగి ఒకరినొకరణంగం ద్రొక్కం బ్రయత్నములు జరిగినట్లు చరిత్రపరిశీలనముచేం దెలియుచున్నది. *అట్టితఱి ఒండొరుల బ్రాహ్మణత్వము విషయమునను గలహములు సంభవించి ఒకరి బ్రాహ్మణత్వము నొకరు దూషించుకొన సమకట్టిరి. ఈదూషణము తలసూపి ఎంతకాలమైనదోగాని,† రథకారాధికరణవాదము §చిత్తూరుజిల్లా తీర్పులనాంటినుండియుం జరిత్ర ప్రసిద్ధమైనది. పై రెండుతావులయందును విశ్వబ్రాహ్మణులకు విజయము కలిగినది. చిత్తూరు జిల్లాలోని వాదము మొదలుకొని సేలం మున్నగుతావులలోం గూడ నట్టికలహము లలంతిగనో గొప్పగనో పొసంగుటయు

---

* మహారాష్ట్రభాషలోని "విశ్వబ్రహ్మకులోత్సాహ" అనుగ్రంథమునందలి ప్రాచీనార్వాచీన ఐతిహాసిక సంగ్రహమును, 1914 సం॥ ఆంధ్ర, ఉగాదిసంచికలోని "విశ్వబ్రాహ్మణులు-ఆర్యాగమనము" అను వ్యాసమును శ్రీభవశేశ్వరపు సోమలింగాచార్యులుగారు ప్రకటించిన "విశ్వకర్మ ఆయన సంతతియు" అను ఆంగ్లానువదిత గ్రంథమును జదువుండు.

† ఈవాదము క్రీ॥ శ॥ 1751వ సంవత్సరమున శ్రీ శ్రీకనుపర్తి బసవాచార్య స్వాములవారికిని ఇతరపండితులకును విజయనగర మహారాజాస్థానమున జరిగినది.

§ 1818 డిశంబరు 15వ తేదీనాంటిది.

అవి న్యాయస్థానముల నుచితరీతిఁ బరిష్కరింపఁబడుటయుఁ దటస్థించుచునేయున్నది. అట్టివాదములు నిన్నమొన్నటివలనకును, అనఁగా నయిదాఱేండ్లవఱకును బొసఁగుచున్నవని చెప్పుటకే యాధునికయుగమున సిగ్గుపడవలసి యున్నది. సాటిసోదర జాతి విద్యావిషయికముగను ఆర్థికముగను ఒకప్పుడు క్షీణత లోనున్న నట్టివారిని దెగడఁబూనుట సభ్యజాతికిలక్షణము కాదని నా తలఁపు.

శాస్త్రిగారికాలమునను అట్టివాదములు చన్నపట్టణము, గుంటూరు, గోకర్ణక్షేత్రము(బొంబాయిరాజధానిలోనిది)మున్నగు తావుల నుప్పతిల్లినవి. మదాసులో సంఘటిల్లినఈవాదములోఁ బాల్గొనినపండితులలో నిరంజనశాస్త్రిగారొకరు. మద్రాసు హైకోర్టులో మహామహోపాధ్యాయ లక్షణసూరియను పండితుఁడు వేదములన్నింటిని దలక్రిందుగాజదివితినని ప్రగల్భములువలుకుచు విశ్వకర్మయన దేవశిల్పిగాని ఋషిగాఁడనియు, నందుచే మానవులకుఁ గూటస్థుఁడగుట పొసఁగదనియు వాక్రుచ్చుచు శాస్త్రి గారి నెదిరించెను. దానిమీఁదట శాస్త్రిగారనేక శుక్లకృష్ణయజుర్వాక్యములను, నిరుక్తవచనములను బ్రమాణీకరించి, విశ్వకర్మ ఋషిత్వమును నిర్ణయించినపిమ్మట నిర్విణ్ణుఁడాయెను. అట్లే ఇంకను వైశ్యకర్మణుల బ్రాహ్మణత్వమునుగూర్చి రాద్ధాంతములు సలిపి గెలుపొందిరి.

తరువాత గుంటూరుకోర్టుకుఁ జెందిన జానపాటికేసులోను వీరు బాల్గొనిరి. అప్పుడు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు, శాస్త్రిగారు సమాలోచనలు చేసికొని

చేదోడువాదోడుగాఁ బనిచేసియున్నారు. అందు కీ॥ శే॥ పండిత యలవర్తి ఆంజనేయశాస్త్రిగారు,తక్కెళ్ళపాటివీరేశలింగంగారు మొదలగువారును, శాస్త్రిగారును వేదశాస్త్రపురాణాగమ వచనములను క్రోడీకరించుకొని వాదములు సలిపిరి.

1934వ ప్రాంతముల గోకర్ణక్షేత్రమునఁ బురోహితులగు *దైవజ్ఞబ్రాహ్మణులకును, తదితరబ్రాహ్మణులకును జరిగిన వివాదములోను వీరు పాల్గొనిరి. అప్పుడు బ్రహ్మశ్రీ వడ్డెపాటి కోటీశ్వరశాస్త్రిగారును నిరంజనశాస్త్రిగారును అచటికేగి దైవజ్ఞబ్రాహ్మణుల పక్షమునవాదించి గెలుపొందిరి.

విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము

ఇట్టి అభియోగములందందుఁ బొడసూపుటయు, నట్టి వానిని సమర్థించుకొనుటకై ఎప్పటికప్పుడు శ్రుత్యాగమ ప్రమాణముల నన్వేషించుకొనుటయుఁ గష్టముగానున్నయది. అందులకై విశ్వబ్రాహ్మణులకు సంబంధించిన వేదశాస్త్రకోటిలోని ప్రమాణములనేరి యొకగ్రంథముగా సంగ్రహించినఁ బండితులకును పామరులకును విషయము తెలియుట సులభముగా నుండునని విశ్వకర్మబ్రాహ్మణవంశాగమమునుగూర్పయత్నము చేసిరి. ఈవిషయము నాగ్రంథముయొక్క ఉపోద్ఘాతములో నుడివియేయున్నారు. "అసమర్థుల చెంగటఁ గుత్సితవాదములు చెలరేఁగె. పాక్షికప్రసంగములు పైకిఁబాకె. పత్రికాహేళన లొకకొంత సందుగొనియె. న్యాయస్థాన విచారణలందంద

* కర్ణాటకదేశమున విశ్వబ్రాహ్మణులు దైవజ్ఞబ్రాహ్మణులనియుఁ బిలువఁబడుదురు.

తెలసూపె. నివారణోపాయము మనస్యమై సవిమర్శకచరిత్ర గ్రంథ రచనకుఁ బురికొల్పె."

ఇంతియేగాక సకలజగన్నిర్మాతయగు విశ్వకర్మ భగవానుని మహిమల వర్ణించుట, ఆ అచింత్యుని అవతార విశేషముల నుద్ఘాటించుట, వేదాలయప్రతిష్ఠితుఁడగు నాదేవదేవు ప్రప్రధాననామమును బ్రచారములోనికిఁదెచ్చి విశ్వకర్మోపాసనను జనులలోఁ బెంపొందించుట, జగత్ప్రవర్తకములగు పావన శిల్పములయుత్కృష్టతంజాటుట, ఆ శిల్పవిభులగు సానగ సనాతనాది ఋషులయు, నింక నితర శిల్పి బ్రాహ్మణ మూల పురుషుల చరిత్రములఁదెల్లముగ వ్రాయుట, మున్నగు ప్రయోజనముల సాధించునిమిత్తమీ బృహద్గ్రంథరచనారంభము.

అట్లయిన ఈప్రయోజనముల సాధించుకొనుటకుఁ బూర్వము మతగ్రంథములు లేవాయని ప్రశ్నింపవచ్చును. కొలఁదిగానున్నవి. శ్రీకనుపర్తి బసవాచార్యస్వామి కృత రథకారాధికరణము, విశ్వవిద్యాభరణము, ఇంకమూల స్తంభము మున్నగు గ్రంథములుండియేయున్నవి. కాని అయ్యవిసమగ్రచరిత్రను జెప్పునవి కావు. రథకారాధికరణమున విశేషించి రథకారులు బ్రాహ్మణులా అను విషయము చర్చింపఁబడును. శిల్పముల యున్నతియు, విశ్వకర్మభగవానుని లీలావిశేషములు నందు మిక్కిలిగాఁ జర్చింపఁబడవు.అట్లే ఇతరములగు నాయాగ్రంథములును కొలఁది కొలఁదిగ నాయావిషయములను బ్రస్తావించునవైయున్నవి. అట్టితఱి సమగ్రముగా నన్నివిషయములను జర్చించు గ్రంథమొక్కటి యావశ్యకమైనది.

శాస్త్రిగారు విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమమును సంగ్రహింపఁ బలుకష్టముల సహించిరి. నానాదేశముల సంచరించి, యందందుఁగల గ్రంథాలయములలోని వివిధప్రామాణిక గ్రంథములను సంపాదించిరి. అట్లు సంపాదించిన వానిలో శాస్త్రిగారికి మిక్కిలియు నుపయోగించినది పూనాలో బ్రహ్మశ్రీ క్షీరసాగర నారాయణశాస్త్రిగారిచే వ్రాయఁబడిన "విశ్వబ్రహ్మకులోత్సాహ" అను పుస్తకము. విశ్వబ్రహ్మకులోత్సాహ తన గ్రంథమునకెక్కుడుగా నుపయోగించినదని శాస్త్రిగారు తన గ్రంథముయొక్క పీఠికలో వ్రాసియే యున్నారు.

విశ్వబ్రహ్మకులోత్సాహ శాస్త్రిగారు సంగ్రహించిన వంశాగమగ్రంథమునకు మూలభూతమని చెప్పవచ్చును. దానిని ప్రకృతిగాఁగైకొని, ఇంకను వలయుసామగ్రిని గూర్చుకొనియు, అధికమని తోఁచిన భాగములను వీడియు వంశాగమమును వ్రాసిరి. నారాయణశాస్త్రిగారి గ్రంథమునఁ జరిత్రాధ్యాయము, గోత్రాధ్యాయము నింకనెక్కుడుగాఁ గలవు. నిరంజన శాస్త్రిగారా రెంటిని, ఇంకను బరిశోధనములుచేసి తానొక తీర్మానమునకు వచ్చినపిమ్మటఁ బ్రకటింతమని తలఁచిరి.

విశ్వబ్రహ్మకులోత్సాహ పదిసంగ్రహములుగా విభజింపఁబడియున్నది. వంశాగమము ఆఱుకాండములుగా విభజింపఁబడియున్నది. ఈవిభాగము చేయుటలో ఆగమగ్రంథమే సులభమార్గమును ద్రొక్కినది. ఆయావిషయములను వరుసగా విమర్శించుటలోను వంశాగమము కులోత్సాహముకన్న తేలికగా నర్థముచేసికొనుట కనువుగానుండును.

వంశాగమములో విశ్వకర్మకాండమున విశ్వకర్మపరాత్పరత్వము, ఋషిశిల్పిప్రజాపత్యాదిభేదములు నిరూపింపఁబడినవి. విశ్వబ్రాహ్మణుల కూటస్థవిశ్వకర్మనుగూర్చి సంపూర్ణవివరణము కలదు. విశ్వరూప త్వష్ట్రుకాండములలో వారి విశేషచరిత్రములు గలవు. శిల్పకాండమున శిల్పముల పూజ్యత, వైదిక లౌకికశిల్పముల విచారము, లోకోపకారకమగు శిల్పము యొక్క మహిమ, శిల్పవిభులును వేదాధిపతులును విశ్వబ్రాహ్మణగోత్రకర్తలును అగు సానగసనాతనాదుల యుదంతములు, శిల్పాచార్యధర్మములు మున్నగు ననేక విషయములు సప్రమాణముగ వ్రాయఁబడియున్నవి. శిల్పముల గొప్పఁదనము నెఱుంగుటకును, శిల్పాచార్యవిధులను వారిగౌరవమును దెలిసికొనుటకును, ఈ కాండము చదివితీరవలయును. రథకారకాండమున రథకారులు బ్రాహ్మణులేయనియు, అమరుఁడు మున్నగువారు వ్రాసిన సంకీర్ణరథకారుఁ డాధానయోగ్యత లేని అవరజాతివాఁడనియు, “వర్షాసురథకారో అగ్నీనాదధీత” అని చెప్పఁబడిన వేదములోని రథకారజాతి విశ్వబ్రాహ్మణ జాతియే యనియు నిరూపించుచు, ఈవిషయమున యాజ్ఞవల్క్యాది స్మృతులకు విజ్ఞానేశ్వరాదులు వ్రాసిన అసంగత వ్యాఖ్యానములను, ఇతరములగు అసంబద్ధవాదములను సోపపత్తికముగా ఖండించిరి. ఇంకను విశ్వబ్రాహ్మణ శబ్దవిచారముఁ జేయుచు నది శాకపార్థివాది సమాసమువలె మధ్యమ పదలోపి బహువ్రీహియనియు, ఉచ్చారణసౌకర్యమునకును అర్థసౌకర్యమునకొఱకును అక్షరములను దగ్గించుట

వైయాకరణ సంప్రదాయమనియు, అదియె వ్యవహారమునను బరిపాటికి వచ్చినదనియు వివరించుచు, రూఢిశబ్దమగు విశ్వబ్రాహ్మణపదమునకే విచారణయే యవసరములేదని సమన్వయించిరి. శాసనకాండమున శాసనములను, బండితుల సమ్మతులను, కొన్ని న్యాయస్థానపుఁ దీర్పులను అలంతిగా నిరూపించిరి.

శాస్త్రిగారు చేసిన చిరపరిశోధనములకు ఫలముగను వేదశాస్త్రపురాణాగమ శిల్పగ్రంథములయందు వారికిఁగల వ్యుత్పత్తి ప్రజ్ఞలకు నిదర్శనముగను సంగ్రహింపఁబడినది విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము. ఇది కేవలము విశ్వబ్రాహ్మణులకే ఉపయోగపడునట్టి దనుకొనఁ గూడదు. హిందూదేశ పూర్వౌన్నత్యమును, హిందూమత శిల్పముల గౌరవమును ఎఱుఁగఁగోరు ప్రతిమానవుఁడును జదువవలసినదే. ముఖ్యముగా విశ్వబ్రాహ్మణులా గ్రంథమును బఠించి, పూర్వపురుషులవలెఁ దామును శిల్పములను బెంపొందించి, భారతదేశ ప్రతిష్ఠకుఁ గారణభూతులై, తమ వంశఋషుల యాదర్శము ననుసరించిన నాఁడే శాస్త్రిగారిశ్రమము సఫలీకృతమగును. శాస్త్రిగారాంధ్రవిశ్వబ్రాహ్మణలోకమునకీ గ్రంథము మూలమున ఎనలేని సేవచేసియున్నారు. ఇది విశేషములలోనికెల్ల విశేషము.

## వివిధశాస్త్రకౌశలము

పూర్వోక్తవంశాగమగ్రంథమే శాస్త్రిగారి వివిధశాస్త్ర కౌశలమును బ్రకటించుచున్నను, ఇంచుక వ్రాయవలసియున్నది. శాస్త్రిగారికి జ్యోతిర్వాస్తుశాస్త్రములయం దసమానపాండిత్యము కలదు. ముహూర్తజాతకభాగములలో మిక్కిలి కృషి

చేసియున్నారు. సిద్ధాంతభాగమున నంతగాఁ బరిచయమున్నది లేనిది చెప్పలేనుగాని కొలఁదిప్రవేశము మాత్రము కలదు. వాస్తుశాస్త్రమున సంపూర్ణమగు విద్వత్తు కలదు. ఆంధ్రదేశమున వాస్తువిద్యలో నిట్టిపండితు లింక నొకరిద్దఱుమాత్ర ముందు రేమో. వీరు పలుకష్టములకోర్చి, వివిధప్రదేశములకరిగి వాస్తు గ్రంథముల నెన్నింటినో సంపాదించిరి. అట్టివానిని సంస్కరించి సంప్రదాయార్థములను దీసి, ఉపయోగించుచుండెడువారు. అట్టిపూర్వగ్రంథములను ముద్రించి జనోపయోగమును గూర్ప వలయునని వారియాశయము. కాని అట్టిపని వారిజీవితములో నెఱవేఱినదికాదు. తుదకు వాస్తుశాస్త్రమునందుఁ బ్రత్యేక కృషిసలిపియు నందలివిశేషములను వారిశిష్యులకుఁ గఱపక మునుపే శాస్త్రిగారస్తంగతులగుట ఆశాస్త్రాభిమానులకుఁ దీరనిలోటు.

సుప్రసిద్ధమగు శాస్త్రిగారి జ్యోతిర్వాస్తుశాస్త్రప్రౌఢి మనుగూర్చి విశేషము వ్రాయనక్కరయుండదు. వీరు బీదవారి కెందఱికో ఉచితముగఁ గూడ ఆశాస్త్రసంబంధమగు సహాయ మును జేయుచుండెడువారు. ధనవంతులగువారు సవర్లకు సవర్లు బహుమానములనిచ్చి తమకార్యములను జక్కబెట్టు కొనుచుండెడివారు. మిక్కుటమగు శాస్త్రిగారి గృహవ్యయము నకీ రాబడియే లేకున్న, వారికుటుంబ నిర్వాహణము కష్టతర మయ్యెడిదే.

ఇంకను వీరికిఁ దర్కవ్యాకరణ మీమాంసాది శాస్త్ర ములలోను బ్రవేశముకలదు. శిల్పశాస్త్రములోను, ఇతరములగు

ఆగమగ్రంథములందును మంచిపాండితి కలదు. ధర్మశాస్త్రములో విశేషమగు వ్యుత్పత్తియున్నది. ధర్మశాస్త్ర సంబంధమగు ఎట్టి క్లిష్టసమస్యలనైనను శాస్త్రిగారు సులభముగా సమన్వయించి సందియములం బాపుచుండెడువారు. ఇంకను వేదార్థనిర్ణాయకములగు నిరుక్తము, శిక్ష మున్నగువానిలోను, దర్శనగ్రంథములందును, ఉపనిషత్తులందును గూడ వీరికిం జక్కని పాండితీప్రకర్షమున్నది. వేయేల? "ఎన్నో వ్యుత్పత్త్యుపజ్ఞల ఈశ్వరాంశ తళుకుతళుకని మెఱసిన, "సూరిస్తుతిప్రథిత పండితచక్రవర్తి" నిరంజనమూర్తి.

## యజ్ఞయాజకత్వము

"యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం"
"యజ్ఞదాన తపఃకర్మ నత్యాజ్యం కార్య మేవతత్"

అని గీతాచార్యుఁడు యజ్ఞదానతపములు పావనములనియు, వానిని విడువఁగూడదనియు బోధించుచున్నాఁడు. యజ్ఞమనఁగా వేదోక్త కర్మకలాపమేగాక సకలప్రాణుల మేలునకై యొనర్చెడు సేవారూపమగు లౌకికకార్యముగూడ నగునని యుపదేశించుచు, గీత పలువిధములగు యజ్ఞములను నిరూపించియున్నది. సకలప్రాణులయొక్క శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తుల వికాసమునకై సలుపఁబడియెడు పవిత్ర కర్మమే యజ్ఞము. సాత్వికమును నిష్కామమునునగు ఈ యజ్ఞమే మానవకోటిని దరింపఁజేయఁగల సాధనము. యజ్ఞకర్త పునీతమగు ఆకర్మముచేఁ దనమనోవాక్కాయములు పవిత్రములు కాఁగా ఇహమునఁ గీర్తిని, పరమున శాంతిని, ఆనంద

మునుబొంది, మానవజీవితలక్ష్యమగు మోక్షపురుషార్థమును సాధింపఁగలుగుచున్నాఁడు.

ఈ యజ్ఞములను సామాన్యముగా రెండుగతుల విభజింప వచ్చును. మొదటివి మానవసేవాద్వారమున భగవంతుని దృప్తిపఱచునవి. రెండవతరగతివి భగవత్సేవామూలమున మానవులకుఁ గల్యాణమును గూర్చునవి. రెండవతరగతి యజ్ఞములనుగూర్చి గీతామాత—

"దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః
పరస్పరంభావయంతః శ్రేయఃపరమవాప్స్యథ"

"యజ్ఞములవలన మీరు దేవతలను బూజింపుఁడు. ఆదేవతలు మీమనోరథములనుదీర్చి మిమ్ము తృప్తిపఱతురు. ఇట్లొకరి నొకరు గౌరవించుకొనుచు శ్రేయస్సును బొందుఁడు" అని నుడువుచున్నది. యజ్ఞములను గూర్చి వ్రాయవలయు నన్నఁ బ్రత్యేకమొకపుస్తకమగును గాన ఒక విషయమును మాత్రము ముచ్చటించి, ప్రస్తుతము ననుసరింతము.

హింసాత్మకయజ్ఞము లెప్పటినుండి ప్రబలెనో కాని, సూక్ష్మమగు విమర్శనదృష్టితోఁ జూచిన అహింసాత్మక యజ్ఞములే మున్నొకప్పుడు సర్వసామాన్యత నందినట్లు వేదాదుల పరిశీలనముచేఁ దెలియనయ్యెడి. *సనాతనార్యులకును, నూతనాగతార్యులకును ఈవిషయమునందే అభిప్రాయభేదములు కలిగి

*ఆర్యులొక్కసారిగా రాలేదు. ఈ విషయమునుగూర్చి 1914 సం॥ ఆంధ్ర ఉగాదిసంచికలోని "విశ్వబ్రాహ్మణులు- ఆర్యాగమనము" అను వ్యాసమును జదువుఁడు.

పరస్పరము వివదించుకొన్నట్లును, కొంతకాలమునకు బుద్ధభగ వానుఁ డవతరించి నూతనాగతార్యుల అహింసాయజ్ఞ సిద్ధాంత మును ఖండించి, సనాతనశాంతిని నెలకొల్పి ప్రాణిలోకమునకుఁ దారకమార్గము నుపదేశించినట్లును సవిమర్శకచరిత్ర పరిశీలన ముచేఁ దెలియఁగలదు.

శాస్త్రిగారికి యజ్ఞవిద్యలోఁ జక్కని పరిచయమున్నది. పలువిధములగు యజ్ఞవిధానముల నెఱింగి చేయింపఁగల యాజ కతాప్రౌఢిమ నిరంజన సుధీంద్రునిలో అప్రతిహతముగాఁ గలదు. వీరు చన్నపట్టణము, చిలకలూరుపేట, యనమదల మున్నగు తావులలో జరిగిన పంచబ్రహ్మయజ్ఞములకును, ఇంక నితర సవనములకును ప్రధానాధ్వర్యులై సత్కారముల నందిరి. ఈ విషయమున శాస్త్రిగారిశక్తి తెలుఁగు ఎల్లలనుగూడ దాటినది. మహారాష్ట్రదేశములోనిదగు బీరారులో జరిగిన రుద్రస్వాహా కారమునకునువీరుప్రధానాధ్వర్యులై అచటివారిమన్ననలనందిరి. శాస్త్రిగారు పాల్గొని నిర్వహించిన యజ్ఞములన్నియు నహింసా త్మకములే. అట్టి పవిత్రసవనకర్మములే విశ్వశ్రేయము నొడఁ గూర్పఁగలవని వారియభిప్రాయము. శాస్త్రిగారు యజ్ఞముల నిర్వహించునప్పుడు ఎల్లవారికిని యజ్ఞతత్త్వమును గూర్చియు సద్దానియాచరణముచే మానవునకు లభించు ప్రయోజనము లనుగూర్చియు నుపన్యాసములు చేయుచుండెడువారు. అందుచే వీరియాజకత్వము సర్వసమ్మాన్యమై చెన్నొందినది.

## ఉపాధ్యాయత్వము

యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము అను ఆఱువిధానములును శాస్త్రి గారి జీవితమునందు దాదర్శముగాఁ బ్రవర్తిల్లినవి. తాను కళా ప్రియుఁడయ్యును, అధ్యయనాధ్యాపనముల నేమఱలేదు. తనకుఁ గల మిక్కుటమగు అధ్యయనప్రీతికి నిదర్శనముగాఁ బెక్కుతావుల వేదపాఠశాలల నెలకొల్పి, స్వయముగ నధ్యాపకపదవిని స్వీకరించియుఁ దగువారిని నియమించియుఁ గొంత పురోహిత వర్గమును నిర్మించిరి. ఒంగోలుతాలూకాలోని "ఆకుల అల్లూరు" గ్రామమున నొకవత్సరమును, 'గారపాడు'నందు పిచ్చయ్య దీక్షితులుగారి స్మారకచిహ్నముగా నేర్పఱుపఁబడిన "దీక్షితసంస్కృతపాఠశాల"లో నొక వత్సరమును అధ్యాపకులుగానుండి వేదపాఠకులను బెక్కండ్ర సిద్ధముచేసిరి. శాస్త్రిగారు మైసూరు, పూనా, గోకర్ణక్షేత్రము మున్నగు తావులకేగినపుడును బ్రబోధోపన్యాసములుచేసి వేదపాఠశాలలను నెలకొల్ప నచటివారి నెంతయో ప్రోత్సాహపెట్టుచుండెడువారు. "ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకం" అనిగదా కవివరుఁడొకఁడు నుడివియున్నాఁడు. శాస్త్రిగారి జీవితముపైసూక్తికి లక్ష్యమై భూమండలమునే తన కుటుంబమునుగాఁజేసికొన్నది. వీరు 'బీరారు, రుద్రస్వాహాకారమున కేగినపుడు 'మేహాకరు'పురమున దైవజ్ఞబ్రాహ్మణులను బ్రేరేపించి ఒక వేదపాఠశాలను నెలకొల్పఁజేసిరి. "పౌరుషేయ బ్రహ్మచర్యాశ్రమ"మను పేర నొక యాశ్రమము సయితము

అపురప్రాంతమున శాస్త్రిగారిచేఁ బతాకోత్సవపూర్వకముగా నారంభింపఁబడియె.

నిరంజనసుధి నిశ్వబ్రాహ్మణసంఘమున క్షీణస్థితిలో నున్న స్వసంఘ పౌరోహిత్యమును విశేషముగాఁ బ్రోత్స హించి, యాజనముయొక్క మహత్త్వమును, లాభములను జాటి, అధ్యాపకాగ్రణియు, యాజకాపతంసుఁడునై యలరారె.

శాస్త్రిగారు దరిదాపు పదునైదుసంవత్సరములు దుగ్గి రాల స్థానికసంఘోన్నతపాఠశాల (Board High School) లోఁ బ్రధానాంధ్రోపాధ్యాయులుగా నుండిరి. ప్రాచ్యబిరుదముల నందకున్నను స్వప్రతిభావశమువనే ఉపాధ్యాయపదవినిసంపా దించి, సర్వజనుల మన్ననలనంది, తోడిఉపాధ్యాయులకుఁ జిరస్మర ణీయులైరి. తెలుఁగుపండితులకుఁ దాటాకులుగట్టు ఆంగ్లపాఠ శాలలలో శాస్త్రిగారు ఎనలేని గౌరవమును విద్యార్థులనుం డియు సంపాదించిరి. అట్టిగౌరవము శాస్త్రిగారియెడ నుండుటకు వారి లోకోత్తరమగు బోధనాపద్ధతియు, ఎట్టి దుందుడుకునేని సంస్కరింపఁజాలు మధురవాక్షణితియుఁ గారణమని విద్యార్థులే చెప్పుచుందురు. అమూల్యమగుశాస్త్రిగారి బోధసుధనుగ్రోలిన వారి శిష్యలోకము గురూత్తమునియందలి భక్తివిశ్వాసముల నాజన్మాంతము మఱచిపోదు.

## దేశసంచారము

శాస్త్రిగారు మహాజనసభపక్షమున శిల్పగ్రంథముల నన్వేషింపఁ బెక్కుతావులఁ దిరిగియున్నారు. శిల్పగ్రంథాన్వేష

ణము వీరికి దేశయాత్రయను ప్రయోజనమునుగూడ ఆను షంగికముగ్గా సిద్ధింపఁజేసినది.

ఈసందర్భమునవీరు ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్రాది దేశములను సమగ్రముగాఁ బర్యటించి యున్నారు. చన్న పట్టణమునందలి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమును, మైసూరు దొరతనమువారి ఓరియంటల్ లైబ్రరీని, పూనా పత్తనములోని నారాయణశాస్త్రిగారి గ్రంథాలయమును, ఇంక నితరపుస్తకభాండాగారములను బెక్కింటిని వెదకి శిల్పశాస్త్ర సంపాదనమునకై పాటుపడిరి. ఇంకను చన్నపురి, బెంగుళూరు, ఆనకల్లు, హొసూరు, రాయవేలూరు, * దత్తమండలము లను బర్యటించి, మానసారము మున్నగు శిల్పవాస్తు గ్రంథము లను సంపాదించిరి. శాస్త్రిగారే యే తావులఁ బర్యటనము చేయుచున్నను సంస్కరణవిధానము నేమఱువారు కారు. వీరికంటెను మున్ముందుగా వీరి సంస్కారభావములు పయనము సాగించి, జనులలో నూతనజ్ఞానతేజమును, కార్యోత్సాహ మును బెంపొందించి కృతార్థులఁజేయ వేగిరపడుచుండెడివి. శాస్త్రిగారు 1914 వ సంవత్సరమున * దత్తమండలములందు సంచారముచేసియున్నారు. ఆ సంచారోద్దేశ్యమును గూర్చి వారిట్లువ్రాసిరి. అది "ఆచార్య" శబ్దమునకు బదులు "ఆసారి" అను శబ్దము నుపయోగింపవలెనని ప్రభుత్వమువారు, జి. ఓ.ను బంపిన తరుణము.

* కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం జిల్లాలకు దత్త మండలములని పేరు.

"......... సంస్కృతము ప్రధానముగాఁగల ఆంధ్రదేశ విశ్వబ్రాహ్మణులకు 'ఆసారి' అను ద్రావిడశబ్దము జుగుప్సా కరము. ఈ అసహ్యమును దొలగింపుడని గవర్నరు ఇన్‌కౌన్సి లుకు విజ్ఞప్తి తయారుచేయబడినది. ఇది తెలుఁగుజిల్లాలలో నన్నివైపులనుండి గవర్నరుకు పంపబడినది. కాని దత్తమండల ములనుండి వెడలలేదు. అచటనుండి విజ్ఞాపనములు వెడలునటుల జేయుటయును, అచటివారికి సంస్కరణమార్గములు బోధిం చుటయును, మాప్రవాసముయొక్క ముఖ్యోద్దేశ్యము." శాస్త్రి గారు దత్తమండలమున సంచారముసేయుతఱిని "గినిగెర"లో ఒకప్రాచీనశాసనముం గనిరి. గినిగెరలో గురువులుగానున్న శ్రీ సాంబమూర్తిస్వామిదగ్గఱ నా శాసనమున్నదఁట. అది కృష్ణదేవరాయలచే నొసంగఁబడినది. కృష్ణదేవరాయలు, మంత్రి, నలుగురు మహాకవులతోడ రుద్రకవి సంతకములు గలవఁట. దీనికి సంబంధించిన వివరములను ప్రబోధినిలో శాస్త్రి గారు విపులముగాఁ బ్రకటించియున్నారు.

శాస్త్రిగారి దక్షిణదేశయాత్ర 1912 వ సంవత్సరమున నొకతూరి జరిగియున్నది. అసమానపాండితీ ప్రకర్షమువలనను, సంస్కరణోద్యమమువలనను 'ఆసేతుశీతనగపూరితభూరికీర్తి' యగు శాస్త్రివర్యు నెఱుంగనివారెవరు ? వీరు ప్రయాణము చేసిన తావులందెల్లను స్వసాంఘికులేగాక ఇతరజనులును వచ్చి వీరి యుపన్యాసామృతమును గ్రోలుచుండెడివారు. శాస్త్రి గారికి ద్రావిడ, కర్ణాటక, మహారాష్ట్రభాషలలో సైతము పాండితిలేకున్నను ప్రవేశముకలదు గావున, సంస్కృతభాషా

సాహాయ్యమున నాయాదేశములం దాయా భాషలతోడనే యుపన్యసించుచుండెడువారు. వారి బోధనలకును, జీవితసంస్కరణమార్గములకును, జాతి మత విషయిక సమన్వయ సిద్ధాంతములకును సంతృప్తులై పెక్కురు పలువిధములగు కాన్కలర్పించుచుండెడివారు.

## మి త్ర మ ం డ లి

దేశసంచార సమయములందు శాస్త్రిగారికిఁ బండిత వర్యులగు స్నేహితులెందఱో లభించిరి. అందుఁ బ్రథమగణ్యులు పూనాపట్టణ నివాసులగు బ్రహ్మశ్రీ క్షీరసాగర బాల శాస్త్రిగారొకరు. వీరు, నిరంజనశాస్త్రిగారు పూనానగరమున కేగినప్పుడు తమదేశవాసులకు సంస్కరణోపన్యాసముల నిప్పించియు, అనేకవిధములగు ప్రబోధమార్గముల నుపదేశింపఁ జేసియు, విశ్వబ్రాహ్మణ సంఘవిషయమై పరస్పరముగల అభిప్రాయవిశేషముల వివరించుకొనియు వర్తించుచుండెడు వారు. "విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమం" అనునట్లు ఇరువురును బండితులు, సంస్కర్తలు, పత్రికాధిపతులు, మత ప్రబోధకులుగాన, ఒకరి భావముల నొకరు సంగ్రహించుకొనుచుఁ బరస్పరముఁ బడెడు శ్రమము నభినందించుకొనకున్నఁ బామరులా ఇఁక సంతసించునది? ఇట్టి అసూయలేని పండిత మిత్రులు చేకుఱినప్పుడేగదా ఏకార్యమునైన సాధింపఁగల్గుట.

నిరంజనార్యుని రెండవమిత్రులు మైసూరుసంస్థాన విద్వచ్ఛిఖామణులును, ధర్మబోధకులును, సకలశాస్త్రగరిష్ఠులునగు బ్రహ్మశ్రీ పండిత, టి. సుబ్బారాయశాస్త్రిగారు. వీరివద్ద

విమానాధికరణ, లోహతంత్రాది శిల్పగ్రంథములున్నవని తెలిసి శాస్త్రిగారా పండితవర్యునితోఁ జెలిమిచేసిరి. శిల్పశాస్త్రప్రసంగములో సుబ్బారాయశాస్త్రిగారు సానగాదులు శిల్పులుగాని ఋషులుగారని వాదించిరి. నిరంజనశాస్త్రిగారు వేదపురాణాగమవచనములను ప్రత్యక్షీకరించి ఋషులని నిరూపించినపిమ్మట వీరియెడ సుబ్బారాయశాస్త్రిగారికి సద్భావముకలిగి గౌరవమేర్పడినది. సుబ్బారాయశాస్త్రిగారు తమవద్దనున్న శిల్పశాస్త్రములోని రహస్యముల నన్నింటిని క్రియాచరణమునకుఁ దెచ్చి, హిందూదేశమునందుఁ బూర్వ శిల్పగౌరవమును మరలఁ దీసికొనిరావలయు ననియెడు ముఖ్యోద్దేశ్యముకలవా రఁట. అందుచే నిరంజనశాస్త్రిగారి శిల్పశాస్త్రప్రచారమునకు సంతసించి, వారిచే ఆహూతులై తణుకులో జరిగిన ఆఱవ విశ్వబ్రాహ్మణమహాసభ కరుదెంచి శిల్పశాస్త్రమునుగూర్చి మహోపన్యాసములు చేసిరి.

కీ॥ శే॥ బ్రహ్మశ్రీ కొమర్రాజు లక్ష్మణరావుపంతులు M. A. గారును వీరికి సుపరిచితులు. లక్ష్మణరావుగారు మునగాలసంస్థానములో దివానుగా నున్నప్పుడును, విజ్ఞానచంద్రికాగ్రంథమండలిని నడపురోజులలోను ప్రబోధినీపత్రికకుఁ బోషకులుగా నుండి ఆర్థిక సారస్వతసహాయములను జేయుచు శాస్త్రిగారి ఉద్యమమునకుఁ జేయూఁత నిచ్చిరి. ఇంకను శ్రీ చెలుకువాడ వేంకటనరసింహము, నందగిరి వెంకటప్పారావు, బ్రహ్మశ్రీ కాకినాడ గున్నయాచార్యులు, మానాంపతి అప్పకణ్వాచార్యులు మొదలగువారును వీరి మిత్రమండలిలోనివారు. శాస్త్రి

గారుసలిపెడు సంస్కరణకార్యములలో వీరందఱును శాల్గొనికృషి చేసినవారే. శాస్త్రిగారికి గున్నయాచార్య అప్పకణ్వాచార్యుల యెడ విశేషమగు అనురాగముండెడిది. యువావస్థలోనున్న ఆయాచార్యద్వయము మరణించినందులకు శాస్త్రిగారు వెల్లువాపోయినారు. సంఘములోని కవులన్నను, బండితు లన్నను శాస్త్రిగారికిఁగల ప్రేమాదరములే ఇందుకుఁ గారణము. అప్పకణ్వాచార్యులు తన బహిఃప్రాణమని వారి మృతి సమయమున—

శా॥ ఎన్నోసంస్కరణంపుఁ గార్యములఁజేయింపంగ దక్షుండవం
చున్నే నెంతయు గంపెడాసమదియందున్నిల్చికొన్నాఁడ; నీ
కన్నందక్షులెవారు మత్కృతులకి సాహాయ్యం బొనర్పంగ, నో
యన్నా! స్వర్గముఁజేరినావె యపకణ్వా! మద్బహిఃప్రాణమా.

అని విలపించిరి. శాస్త్రిగారి శిష్యులలో అసమానమగు నవధాన కౌశలమున మెఱయుచుఁ బసుచుఁదనమునసే మిత్తి వాతఁబడిన సుకవిచంద్రుఁడు శ్రీగిరి చెన్నబసవయ్యశాస్త్రి గారు. వీరి మరణమును శాస్త్రిగారికిని విశ్వబ్రాహ్మణ సంఘమునకుఁ దీరని లోటువాటిల్లఁజేసినది. "శిష్యోన్నతిఁ జూడఁ జాలని అభాగ్యగురుత్వము నాకొసంగి నీచెన్నదొలంగి పోయితివె శ్రీగిరివంశ పయోధిచంద్రమా" అని యాతని మరణము తన దురదృష్టమనియే శాస్త్రిగారు తలఁచినారు. ఇట్టి విషయములన్నియు నిరంజనార్యునకు విద్యార్థులయెడఁ గల ప్రేమ విశ్వాసములకు నిదర్శనములు.

## భక్తియోగము

శాస్త్రిగారు విశ్వకర్మభగవానునికిఁ బ్రియభక్తులు. వేదములోఁ జెప్పఁబడిన విశ్వకర్మలీలావిశేషములను స్మరించి తన్మయులగుచుండెడువారు. ఇందులకుఁ గారణము ప్రపంచ హేతుభూతమైన శక్తికి విశ్వకర్మనామము ఉచితమును, అర్థవంతమును అయియుండుటే యని పలుసార్లు వాక్రుచ్చియున్నారు. విశ్వకర్మశబ్దములోని అర్థమాధుర్యము, దానికి సాయణాచార్యాదులు చేసిన వివరణము బాల్యమునుండియుఁ దన్ను ఆదేవదేవునియందలి భక్తికిఁ బురికొల్పి, దానిని నైజమనీషగా నొనర్చిన దనియుఁ జెప్పుచుండెడువారు. తాను విశ్వకృత్ప్రియుఁడయ్యు విష్ణు ఈశ్వరాదులయందు వైముఖ్యమును గలిగియుండుట లేదు. కతమేమన? సృష్టిస్థితి ప్రళయ తిరోధానానుగ్రహములను పంచకర్మములకు అధినాథులగు బ్రహ్మాది పంచకర్తల సమష్టిస్వరూపమే విశ్వకర్మతత్త్వమను రహస్యము నెఱింగినవారు కావున, ఇతరదైవములన్నను వారికి భేదభావముండెడిదికాదు. విశ్వకర్మభగవదుపాసన మానవులలో క్షీణించి నందులకు శాస్త్రిగారు చింతిల్లుచుండెడివారు. తన జీవితములో నెచ్చటనైనను విశ్వకర్మ దేవాలయమును నిర్మించి, ఆదేవతా సార్వభౌముని పూజాపురస్కారములు పెంపొందించి తత్త్వార్థమును బ్రచారముచేయ నువ్విళ్లూరుచుండెడి వారేకాని, ఆయుఃశ్రీ నిండారమిం జేసి యందుఁ గృతకృత్యులు కారైరి. అయినను తద్భగవదుపాసనా బీజములను జనులలో నాటియే యున్నారు కావున ఫలింపకపోవు.

## చ ర మ జీ వి త ము

విశ్వకర్మపరాత్పరుని ప్రియ భక్తావతంసుఁడును, నిష్కామకర్మయోగియు నగు శాస్త్రివరేణ్యుఁడు ఈవిధముగాఁ దన జీవితమునంతయు సంఘసంస్కరణమునందును, సారస్వత సేవయందును, మతవిషయములందును వినియోగించి, మానవ జీవితము విచ్చలవిడిగాఁ బ్రయోజనముమాలిన విషయము లందు వ్యర్థపుచ్చఁదగినది కాదనియు, సర్వలక్షణశోభితముగా సంస్కరించి, ఇహమునఁ బరోపకారమును, బరమున వినిర్మల శాంతిని గూర్చుకొనఁదగియున్నదను ఘనపాఠమును నేర్పి, ఈశ్వరసంవత్సర ఆశ్వయుజ శుక్ల త్రయోదశి ఆదివారము (17—10—1937) నాఁడు నశ్వరమగు భౌతిక శరీర మును వీడి, అజరామరమైన కీర్తిశరీరమును ధరించెను. వారు భౌతికదేహములో నివసించియున్నది అఱువదివత్సరముల మూఁడుదినములు మాత్రము. అయినను సాధించిన సత్కార్య ములు పెక్కులు. శాస్త్రిగారు మరణించినను వారి సత్కార్య చరితలును, భావములును వారి గ్రంథములం దిమిడియున్నవి. వేయేల, నిరంజనహృదయము వాఙ్మయమను నద్దములోఁ బ్రతి బింబించియే యున్నది. విశ్వకృత్పాదపీఠముమీఁద త్రికాలములు పరిమళించు పారిజాత పూజాపుష్పమగు నిరంజన కవిశేఖరుని యొక్క జీవితచరిత మెల్లర కాదర్శప్రాయమై యలరారు గాక !

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౧ | ౧ | ఇది శ్రీనగగోత్ర | ఇది శ్రీసానగగోత్ర |
| ౧౬ . | ౧౮ | బాట నూటిగా | బాట సూటిగా |
| ,, | . ౧౯. | హృద్గతఘైనఘట్టి | హృద్గతమైనయట్టి |

# కల్హారమాల

తేనెనద్దిన తీపిపదముల
తీర్చి దిద్దిన నవకవితా
శ్రీలహరిలో హృదయనౌకలు
తేలియాడును..., కల్హారమాల

ఖండకావ్యముల సంపుటి. వెలువడుచున్నది.

పూర్వశిల్పవైశిష్ట్యమును జ్ఞప్తి కొలయించి, హృదయములఁ ద్రవింపఁజేయు శిల్పగీతములు! నవ్యోత్పత్త్య కళావిలాసములతో మెఱుఁగులుతీరిన వివిధఖండికలు!! అవి [illegible]!

అస్మదాచార్య శిల్పకళాంగణమున
తాండవించు హిందూకళాభ్యుదయము [illegible]
తెగి పుడమిఁగూలె అవి ప్రాతకథనుండి
ఇపుడు హృన్మర్మములను భేదించుచుండె.

..................

శిల్పవిద్యాప్రవీణు దాచిపడనేను
పూర్వసాహిత్యవాణికే పుట్టినింగ
విస్మయముపొంది సుకవి [illegible] నిన్నుకీర్తి
[illegible] నన్ను [illegible]